KALIKALU—TELUGU
By B. GOPALA REDDI

ప్రథమ ముద్రణ
జనవరి 1989



వెల : పది రూపాయలు

ప్రతులకు :
ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

ముద్రణ :
స్ప్లెండర్స్
హైదరాబాదు-500 029

# గ్రంథకర్త జీవన వివరాలు

జననము : 5 ఆగస్టు, 1907
బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు జిల్లా.
తండ్రి - పట్టాభిరామిరెడ్డి
తల్లి - సీతమ్మ.

చదువు : బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు
ఆంధ్ర జాతీయ కళాశాల
(1921-24).
విశ్వభారతి, శాంతినికేతన్
(1924-27).

సమర పర్వము : సర్కారుబడి వదులుట-జనవరి 1921.
జైలు శిక్షలు - ఆరు మారులు.
1930, 31, 32, 33 లోను,
1940, 41, 42, 43 లోను
కొంతకాలం జైలులో ఉంచినారు. దాదాపు
4 సం॥లు జైలులో మకాం. ఎ.బి.సి. క్లాసుల
ఖైదీగా, డెటిన్యూగా.

ఉద్యోగ పర్వము : మద్రాసులో 86 మాసాలు
కర్నూలులో 19 మాసాలు
(ఆంధ్ర ముఖ్యమంత్రిగా)
హైదరాబాదులో 16 మాసాలు
(ఆంధ్రప్రదేశ్ మంత్రిగా)
కేంద్రమంత్రిగా 66 మాసాలు
ఉత్తరప్రదేశ్‌లో గవర్నరుగా 62 మాసాలు
ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రో-ఛాన్సలర్‌గా-
జూన్ 1951 నుంచి 72 మాసాలు

సాహిత్య పర్వము : తెలుగు భాషాసమితి అధ్యక్షత 1948-86 వరకు
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షత-
ఆగస్టు 57 నుండి డిసెంబరు 1982 వరకు
కేంద్ర సాహిత్య అకాడమీ (రెండవ మారి)
జనవరి 78-జనవరి 88
జ్ఞానపీఠము 1963-71

# బెజవాడ గోపాలరెడ్డి పుస్తకాలు

## ముక్తకాలు

1. ఆమె (1978)
2. ఆమె జాడలు (1981)
3. ఆమె నీడలు (1981)
4. ఆమె తళుకులు (1982)
5. ఆమె చెణుకులు (1983)
6. స్ఫులింగాలు-తుషారాలు (1984)
7. స్వప్నహారము
   వీచికలతో సహా (1986)
8. దీపికలు (1988)
9. కళికలు (1989)

## దీర్ఘ కవితలు

1. కాలవాహిని (1979)
2. సాహిత్య సుందరి (80)
3. ప్రసూన మంజరి (81)
4. పరిమళ తరంగాలు (82)
5. సాగర సమీరాలు (83)
6. మలయ మారుతాలు (85)
7. సౌరభ నీరాజనాలు (87)

## రానున్నవి

1. గాలిబ్-ఇక్బాల్
2. ఫిర్యాదు-జవాబు (ఇక్బాల్)
3. ఇక్బాల్ ఇతర కవితలు
4. నా సొంతాలు - శశాంక రేఖలు
5. ,, గులాబి రేకులు

# అంకితము

నన్ను అనురాగముతో ఆదరించు చుండిన స్వర్గస్థులగు ఆత్మీయులు

శ్రీ జక్కా బలరామరెడ్డి

శ్రీ జక్కా వెంకటు శేషమ్మగార్ల

దివ్య స్మృతికి

# నివేదన

బెంగాలీనుండి, ఉర్దూనుంచి చేసిన అనువాదాలు కాక, నా సొంత రచనలను మూడు పాయలుగా అల్లుకొన్నాను. 1. ముక్తకాలు, 2. దీర్ఘ కవితలు, 3. భావ చిత్రాలు (sketches). దీర్ఘ కవితలను ఏడు సంపుటము లలో ప్రచురించాను : 1. కాలవాహిని, 2. సాహిత్య సుందరి, 3. ప్రసూన మంజరి, 4. పరిమళ తరంగాలు, 5. సాగర సమీరాలు, 6. మలయ మారు తాలు, 7. సౌరభ నీరాజనాలు.

భావచిత్రాలను ప్రచురింపబోవుచున్నాను. 1. శశాంక రేఖలు 2. గులాబీ రేకులు. త్వరలో బయటకు రాగలవని ఆశ. నా పెద్ద పంట ముక్తకాలే! 'కళికలు' నా తుది ముక్తకాల సంపుటమేమో! 1-5 ఆమె పంచకము, 6. స్ఫులింగాలు-తుషారాలు (రెండు సంపుటముల ఒకే పుస్తకము) 7. స్వప్నహారము (స్వప్న, ఉల్లేఖములు నేడు, వీచికలు), 8. దీపికలు 9. కళికలు.

స్వప్నహారములోని వీచికలతో సహా 1792 అని ముందే వ్రాసు కొన్నాను.

210 దీపికలలోని ముక్తకాలు
255 కళికలలోనివి
మొత్తము 2257 అయినవి.

'ఆమె'తో ఆరంభమైన ఈ ముక్తకాల పరంపర 2257 వరకు సాగునని కలలో కూడా ఊహించలేదు. 'ఆమె' ప్రేరణ ఇంతదూరము లాగింది, సాగింది. ఆ వ్యక్తికాని శక్తి ప్రభావము ప్రబలమైనదే. తెలుగులో ఇన్ని ముక్తకాలు మరెవ్వరూ వ్రాయలేదేమో! ఉప్పు ప్రక్షిప్తాంతో సహా, కర్పూరపు వేమన్న వ్రాసినాడేమో! ఏమైనా, ఇదొక సంతృప్తి. గర్వయుత మైన సాహసమే కావొచ్చు!

ఇందులో ఏదైనా రుచో, రంగో, వాసనో ఉంటే, సహృదయులు సంతోషిస్తే నేను ఆనందపడుతాను. నా కృషి ఫలితము సార్థకమైనదని తలుస్తాను.

కోరగనే కాదనక, మిత్రులు కళాప్రపూర్ణ బోయి భీమన్న అస్వస్థులుగా ఉన్నా ముందుమాటలు వాసినందులకు నా కృతజ్ఞతలు, వందనాలు.

మకాం, మద్రాసు
20-12-1988
శాంతి నికేతన్, నెల్లూరు

బెజవాడ గోపాలరెడ్డి

# గోపాలరెడ్డీయం

డా. బెజవాడ గోపాలరెడ్డిగారు
ఆబాల వృద్ధ జన సారస్వత గోపాలుడు
సమగ్ర జీవిత సర్వస్వ భూపాలుడు
వశీకృత నవ భాషా కవి పండిత నృపాలుడు
అధునాతన వేద దర్శకుడు, ఋషి !

రమణీయ రసమంజరులుగా డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు తీర్చిదిద్దిన కవితా 'కళికలు' చూచి, స్పృశించి, స్పందించి, ఆనందించిన నేను ఆయనను సాక్షాత్కరించుకొన్న మూర్తిమంతత్వం ఇది.

గోపాలరెడ్డిగారి సాహితీ ప్రస్థానంలో ప్రధానమైన దశలు మూడు. 1. ఆంధ్రీకృత రవీంద్రం, 2. సాహిత్య అకాడమీ నేతృత్వం, 3. సఫలీకృత పూర్ణ ఋషిత్వం.

ఇంతవరకూ నాకు పరిచితులు మొదటి రెండు దశలలోని రెడ్డిగారే. ఇప్పుడు ఈ మూడోదశను దర్శిస్తున్నాను ఈ కళికలలో.

రెడ్డిగారి సాహితీ సృష్టి ఒక త్రిపర్ణ చిత్రం అనుకొంటే, ఈ చిత్రం ఆకృతి ధరించిన కాన్వాస్ బహు విశాలమైన రాజకీయ రంగం. అది విశ్వ విశాలమైనట్టిది. జాతీయోద్యమంలో, స్వాతంత్ర్య పోరాటంలో యువ యోధుడుగా, రాజకీయ ఖైదీగా, స్వాతంత్ర్యానంతరం ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో మంత్రిగా, ప్రత్యేకాంధ్రరాష్ట్రం (కర్నూలు)లో ముఖ్యమంత్రిగా, ఆంధ్రప్రదేశ్‌లో మంత్రిగా, ఢిల్లీలో కేంద్రమంత్రిగా, ఉత్తరప్రదేశ్‌లో గవర్నరుగా-ఈ విధంగా గోపాలరెడ్డిగారి ప్రాభవం క్రమోన్నతిని పొందుతూ, త్రివిక్రమత్వాన్ని సంతరించుకొన్నట్టిది. ఉజ్వలమూ, సువిశాలమూ, విజయ పరంపరా భద్రమూ అయిన ఈ కాన్వాస్‌పై రెడ్డిగారు సాధించిన సాహితీ సృష్టి అద్వితీయమైనట్టిది, అనన్య సామాన్యమైనట్టిది.

ఇక్కడ గుర్తించవలసిన దేమిటంటే ఆయన కవితా రచనకు రాజకీయ రంగం ఒక కాన్వాస్ మాత్రమే. ఆయన సాహిత్య సృష్టికి అది సహక రించింది. అంతే !

కవి తిక్కన, ఖడ్గ తిక్కనలు కలసిన సమైక్య మూర్తిగా ఉపమించ వచ్చు రెడ్డిగారిని. ఆయన పుట్టుకతోనే కవీ, యోధుడూ. యోధుడుగా స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని, స్వతంత్ర భారతంలో వివిధ బాధ్యతలను నిర్వహించి, కవిగా సాహిత్యరంగాన్ని పరిపాలిస్తున్న సంకల్ప సిద్ధుడాయన.

చినికి చినికి గాలివాన పట్టిందనేది సామెత. సాహిత్య రంగంలో ఈ సామెతకు సజీవ రూపం గోపాలరెడ్డిగారు. ఆయన చిన్నప్పుడేమి వ్రాశారో తెలియదు. వ్రాసే వుండాలి. శాంతి నికేతనంలో విశ్వకవి రవీంద్రుని సాన్నిహిత్యం లభించిన తర్వాత వంగ భాషా మాతృకలనుంచి ఆంధ్రీకరణ మొదలయింది. ఈ సందర్భంలో రెడ్డిగారిని నన్నయగారితో పోల్చవచ్చు. నన్నయగారు సంస్కృత భారతాన్ని తెలుగు చేసినప్పుడు సంస్కృత పదా లన్ను విచ్చలవిడిగా వాడాడు. అలానే గోపాలరెడ్డిగారు వంగభాషనుంచి రవీంద్ర సాహిత్యాన్ని తెలుగు చేసినప్పుడు వంగభాషా వైఖరిని తెలుగులో ప్రవేశ పెట్టారు. అదీ రెడ్డిగారిలోని ప్రతిభ !

ఇక్కడొక మాట చెప్పాలి. తెలుగులో సనాతన అధునాతన రచనల నుంచి ఏ ఒక్క వాక్యమైనా ఉదాహరించి అది ఎవరి రచనో చెప్పమంటే చెప్పటం కష్టమే. ఆధునికుల విషయంలో ఇది మరీ కష్టం. అయితే రెడ్డి గారి రచనలనుంచి ఏ ఒక్క వాక్యాన్ని తీసుకొన్నా అది రెడ్డిగారిదని సులువుగా చెప్పవచ్చు. అదీ ఆయన రచనా శిల్పంలో విశిష్టత. శైలే వ్యక్తిత్వ మంటారు. ఈ యుగంలో రెడ్డిగారిది అట్టి ప్రబల వ్యక్తిత్వం.

రవీంద్రుని తెలుగు అనువాదాలను చదువుతున్నప్పుడు రెడ్డిగారు సాక్షాత్తు రవీంద్రుడి లాగే కనిపిస్తారు. ఒక విలక్షణమైన, విశిష్టమైన శైలి రెడ్డిగారిది. తెలుగులో చక్కని వచన కవితాశైలిని ఆవిష్కరించిన మొట్టమొదటి కవి రెడ్డిగారే అనవచ్చు.

సాహిత్యాధినేతగా సుమారు ఒక తరంపాటు అంటే 30 సంవత్సరాల పాటు ఆయన చేసిన కృషిని అభివర్ణించాలంటే ఆయనను భోజరాజుతోనూ, కృష్ణదేవరాయలతోనూ పోల్చవచ్చు.

"ఎనమండ్రే కృష్ణురా
యని కొల్వులో కవులు
అఖిల భారతము నీ
ఆస్థానమే నేడు
గోపాల రెడ్డ్యగ్రణీ ! సాహితీ
భూపాల దివ్యన్మణీ !"

అంటూ నేను నా "మానవుని మరొక మజిలీ" గేయ నాటకాన్ని రెడ్డిగారికి అంకితమిస్తూ పేర్కొన్నాను. ఆ నాటి రాజ్యాలు పరిమిత దేశభాగాలు కలిగి నట్టివి. పూర్వకాలపు ఏ ఒక్క తెలుగురాజ్యం కంటే ఈనాటి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం పెద్దదీ, విశాలమైనట్టిదీ, చాల గొప్పదీ కూడా. అట్టి ఆంధ్రప్రదేశ్‌లో సాహిత్య అకాడమీ అధినేతగా రెడ్డిగారు చేసిన కృషి, ప్రోత్సహించిన కవి పండితుల దృష్ట్యా, నిర్మింపచేసిన సాహితీ సంపద దృష్ట్యా ఉన్నతోన్నత మైనట్టిదీ, ఉత్తమోత్తమ మైనట్టిదీ. అంతే కాదు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధినేతగా ఆయన మొత్తం భారత జాతీయ సారస్వత సామ్రాజ్యాన్నే పరిపాలించా డనవచ్చు. అనేక విధాల అది పరమ సత్యం.

రెడ్డిగారి సాహితీ ప్రస్థానంలో మూడవ దశ "ఆమె"తో ప్రారంభ మయిం దనవచ్చు. మొదటి రెండు దశలలోనూ ఆయన చేసిన తపస్సు ఫలించి పరమ సంపూర్ణ సారస్వత మూర్తిగా ఆమె సాక్షాత్కరించింది. వాల్మీకి, వేమన్న మొదలైన సనాతన మహాకవులు ఆలస్యంగా వికసించిన కవితా పారిజాతాలే. ఆ వరసలో గోపాలరెడ్డిగారిని చేర్చవచ్చు.

వృద్ధాప్యంలో కవిత్వం వ్రాస్తున్నా నంటారు రెడ్డిగారు. వృద్ధాప్యంలో వ్రాసిందే కవిత్వం అంటాను నేను. అందుకు వాల్మీకినీ, వేమననూ ఉదాహరిస్తాను. సంస్కృతంలో వాల్మీకి, తెలుగులో వేమన ఏ వయసులో సాహితీ సృష్టి చేశారో కొంచెం ఆలోచించి చూస్తే ఈ నాడు రెడ్డిగారు సృష్టిస్తున్నదే నిజమైన సారస్వతం అనడానికి అభ్యంతరం వుండనక్కరలేదు.

మహాభారతం వ్యాసుడి జీవిత చరిత్ర అయినట్టే "ఆమె" నుంచి ఆమె వేణీస్థగిత "కళికలు" దాకా రెడ్డిగారు వెలువరించిన కవితా వైభవాన్ని తిలకించినప్పుడు, ఈ వైభవమంతా రెడ్డిగారి జీవిత చరిత్రగానే భాసిస్తుంది. సాహిత్యం సమకాలీన సృజనగా వుండాలి. రెడ్డిగారి సమకాలీన దేశ పాత్రలు ఇవన్నీ. రెడ్డిగారి సమకాలీన దేశ పాత్రలే ఆయన జీవిత చరిత్ర. అదే ఈ సారస్వతం.

కవిగా ఆవిర్భవించిన తర్వాత రెడ్డిగారు వెలయిస్తున్న కవితల్ని నేను ఋక్కులతో పోలిస్తే ఎవరికీ అభ్యంతరం వుండకూడదు. కవి ఋషి. ఋషి వాక్కు ఋక్కు. గోపాలరెడ్డి గారు ఋషి. ఆయన రచనలు ఋక్కులు, వేదాలు.

వేద ఋక్కులు ఎలా వెలువడ్డాయో గమనిస్తే, ఈనాడు రెడ్డిగారు వెలయిస్తున్న కవితల్ని నిజంగా అర్థం చేసుకోవచ్చు.

"విజ్ఞాన క్షితిజములు విస్తరిల్లుచున్నాయి
సమర పరికరాలు వినాశ తాండవము నల్పుచున్నాయి
మన్మథుడు పెరగక ఎదగక
వామనుడుగనే ఉన్నాడా ?
ఇంకా పుష్పబాణుడు
పంచ కుసుమములతోనే తృప్తి పడతాడా ?"

ఇది ఈ సంపుటిలో ఒక కళిక. దీన్ని విశ్లేషిస్తే రెడ్డిగారి కవితా శైలిని, దృక్పథాన్ని కూడా పూర్తిగా అర్థం చేసుకోవచ్చు. విజ్ఞానం ఎంత ప్రగతిని సాధించిందో మనందరకూ స్పష్టంగా తెలుస్తూనే వుంది. అన్ని రంగాలలోనూ అపూర్వమైన పురోగమనాన్ని మానవుడు సాధిస్తే మన సాహిత్యంలో ప్రేమనాథుడైన మన్మథుడు ఇంకా పుష్పబాణుడుగానే వున్నాడు. ఏమాత్రమూ పెరగలేదు. ఏ కొత్త ఆయుధాన్నీ సంపాదించుకోలేదు. అంటే పురోగమిస్తున్న ఆధునిక సమాజానికీ, ఎక్కడి దక్కడే పడివున్న తెలుగు సాహిత్యానికీ ఎంతటి అంతరం వున్నదో రెడ్డిగారు సూచిస్తున్నారు. ఈనాటి యువతీ యువకుల నవ నాగరకతకు సమానంగా నవ నవ శక్తిమంతాలైన నూతనాస్త్రాలను సృష్టించుకోలేని మన్మథుడు తన పాత పూవుటమ్ములు

పనిచేయక ఎంత గింజుకొని ఏం లాభం? ఈ వర్ణనను అన్యాపదేశంగా ఒక్క సాహిత్యానికే కాక జాతి స్తబ్ధతకూ, దేశ బలహీనతకూ కూడా వర్తింప చేయవచ్చు కదా!

రెడ్డిగారి కవితాశైలిని కూడా ఈ కళికలో మనం గుర్తించవచ్చు. "విజ్ఞాన క్షితిజములు విస్తరిల్లుచున్నాయి" అంటా రాయన. గ్రాంథికమైతే "విస్తరిల్లుచున్నవి" అనాలి. వ్యావహారికమైతే "విస్తరిల్లుతున్నాయి" అనాలి. విస్తరిల్లుతున్నై" అని కూడా అనవచ్చు. అలాగే ఎందుకనాలి? అని ప్రశ్నిస్తారు రెడ్డిగారు. అదీ ఆయనలోని ప్రత్యేకత. ఇలానే ప్రతి కళికనూ విశ్లేషించవచ్చు.

"ఎర్రకోట జెండా
ఎన్ని కలల పంటో
ఎన్ని త్యాగాల ఫలితమో
ఎన్ని ఆకాంక్షల విజయమో?"

జాతీయోద్యమ చరిత్రనంతా నాలుగు చిన్న చరణాలలో ఎంత చక్కగా బిగించారో చూడండి.

"పొంగే పాలను
పట్టి ఉంచుకోలేదు పసిడి పాత్రయైనా
ఒలికి పోవడానికి
కులుకుచు వస్తాయి అంచులపైకి!"

"నా పళ్లెరములో
ఆమె కర్పూరము వెలిగించి"

"తొలినాళ్ల తియ్యదనము
లోపించిందని అనుమానమా?"

అంటారు మరోచోట. ఎలాంటి అనుమానం అక్కరలేదు. పైగా తియ్యదనము పెరిగింది. ఇలాంటి ఎన్ని కళికలనైనా గోపాలరెడ్డిగారు తమ సాహితీ వనంలో నిర్భయంగా పూయించవచ్చు. అసంఖ్యాకంగా దండలు గుచ్చి

తమ "ఆమె"ను అలంకరించవచ్చు. అట్టి రచనా సౌందర్యంకోసం సహృదయ లోకం యావత్తూ ఎదురు చూస్తూనే వుంది.

"పుస్తకాలు వ్రాసేది మనబోటి వాళ్లే
దేవ సమానులు కాదు, దివ్య ప్రాణులు కాదు."

"మన పూర్వులు చెప్పిన దంతా
కడపటి సత్యమా ?
వారు తిని మిగిల్చినదానిని
మనము నెమరు వేస్తుండాలా ?"

"అదే మారని, అన్నికాలాల సత్యమని
ఎందుకు తలవాలి ?"
"మానవుడు పుట్టిన చాలా యుగాలకు
పుట్టాడు దేవుడు"

"సచిత్ర వారపత్రికలలో
పవిత్రలైన సీతా సావిత్రుల
బొమ్మ లుండవు"

"సంప్రదాయం కుంటుచూ
వెనుక బడుతుంటే
ఆధునికత ఎగురుచూ
ముందుకు నెట్టుకొని వస్తున్నది."

"ఒకనాడు మనుధర్మ శాస్త్రాన్ని
తగులబెట్టింది పెద్దాడ కామేశ్వరమ్మ"

"విజ్ఞానయుగ వారసులు
నేటి విద్యార్థి బృందాలు"

"ఎందుకీ చెదలు తిన్న మతాలు ?"

"త్యాగశీలుర సమాధులపై
కనక సింహాసనాలు చేరాయి"

"రేపు చేరగనే, పోవలసిన రేవులు కనిపిస్తుంటాయి"

"సాహసవంతులే
కొత్త మాగాణములు దున్నగలరు"

"రాజకీయాల్లోకి రావడం
సేవాపతాకాన్ని చేబూని
అధికారాన్ని చేపట్టాలనే కదా!"

"మబ్బుల వీపుల మీద
ఎంత ఎండ కాస్తున్నదో"

ఈ విధంగా ఉదాహరిస్తూ ఎంతైనా వ్యాఖ్యానించవచ్చు. అది ముందు తరాల పండితులు చేయవలసినట్టిది. ఇవన్నీ వేదాలన్నాను కదా! రెడ్డిగారి మనో భావ క్షేత్రాలనుంచి విచ్చలవిడిగా పుట్టుకొచ్చిన వేదాలివి. అసలు వేద స్వభావమే అంత. వీటిని విభజించడానికి ఎవరో ఆధునిక వేదవ్యాసుడు పూనుకోవలసి వుంది.

చివరగా ఇక్కడ రెడ్డిగారి ఒక వేదాశీస్సును ఉదాహరిస్తున్నాను.

"ఆత్మానందములో ఆమె సౌజన్యమును పంచే
రోజా మొగ్గ అన్నాను
గులాబీ కళికయై, నిజసౌందర్యాన్ని, సుగంధాన్ని
సాయం సమయాల చూపి, సంతస పరచుగాత!"

"వర్తమానము ఆమెకు అన్నీ ప్రసాదించింది
చదువు, అందము, పదవి, సంతానము
భవిష్యత్తుకూడా ఆమెను అదే రీతి సంరక్షించుగాత
జీవిత సమరములో
భవిష్యత్తే కవచమై కాపాడు గాత!"

బోయి భీమన్న

# కణికలు

**1**

ఎర్ర కోట జెండా
ఎన్ని కలల పంటో
ఎన్ని త్యాగాల ఫలితమో
ఎన్ని ఆకాంక్షల విజయమో ?

**2**

పూర్తికాని యజ్ఞాల ధూమమో
విచ్చని మొగ్గల పరిమళమో
అసమాప్త సమరాల కేతువో
ముందు తరాలను నడిపించే శంఖారావమో
రెపరెపలాడే ఆ త్రివర్ణ పతాకము !

**3**

చచ్చినా చావనిది
కీర్తి కాముకత-
బ్రతికి యున్నపుడే
కీర్తి సమాధికి
కలల పందిళ్లను కట్టిస్తుంది !

4

మరచిన జావళీ వలె
మరవని పల్లవి వలె
మనస్సున నాటాయి
ఆమె వీడ్కోలు చిరునవ్వులు !

5

మరణించిన మనోహరి
చీరెకొంగు ముడిని
ఎందుకు విప్పుతావు ?
ఏ రహస్యాన్ని వదిలపరచుకొన్నదో
ఏ జ్ఞాపకాన్ని దాచుకొన్నదో ?

6

పదవీ విరమణ చేసిన పాలకుని
వాగ్దానాలు ఎవరికి ఊరట కల్గిస్తాయి ?
ఎవరి సంకటాల కన్నీటిని తుడుస్తాయి ?

7

గాయపడిన సైనికుని
కొన ఊపిరి పలవరింతలు
ఎవరిని అదిరిస్తాయి ?
నక్కలు కూడ బెదరిపోవులే !

## 8

ఆరిన నిప్పు
కొలిమి తిత్తుల చప్పుడులకు
రేగదులే-
బూడిద మాత్రము
కంటినిండ పడుతుందిలే !

## 9

ముసలి గాయకుని
క్షీణ స్వరములో
రాగము పలికినా
తన్మయత్వ మధురిమ
మాసి పోయిందిలే !

## 10

సంగీతములో
రాగము ముసుగు తీసి
రంగప్రవేశము చేస్తుంది
తాళము ముసుగు తీయకనే
గజ్జెల రవళిని వినిపిస్తుంది.

## 11

ఎండిన ఆకుల మంటలు
చాలసేపు మన్నవులే !
గప్పున ఎగసి, చప్పున ఆరిపోతాయిలే !

## 12

కోరలు తీసిన నాగు
పడగ బాగానే విప్పుతుంది
పసలేని బుసబుసలు చేస్తూ
తల బాగానే ఆడిస్తుంది.

## 13

పొంగే పాలను
పట్టి ఉంచుకోలేదు పసిడి పాత్రయైనా
ఒలికి పోవడానికే
కులుకుచు వస్తాయి అంచులపైకి !

## 14

రాలిన రేకులు
గులాబీ పువ్వును జ్ఞప్తికి తెస్తాయి
తరుణ విలాసిని
కోమల హస్తములో శోభిల్లవు
రాలిన రేకుల పూర్వశోభలను
ఎందుకు స్మరిస్తూ ఖిన్నుడగుతావు ?

## 15

వసంతానికి వీడ్కోలు నిచ్చిన ఎండలు
మలయమారుతాల రానియ్యవులే
కోకిల పంచమస్వర కూజితాలను
మొన్నమొన్ననే మరచిపోయిందిలే !

## 16

వృద్ధ విహంగము
విను వీథులకు
ఎగిరి పోతుందని
భయపడ నక్కర లేదు.

## 17

వాడిన వకుళపు
వీడని వాసన
వస్త్రములలో దాగే ఉన్నది.

## 18

నా పళ్లెరములో
ఆమె కర్పూరము వెలిగింది;
లేత చీకట్లలో
చిరు వెలుగులు వెలిశాయి, మెరిశాయి !

## 19

నీ వొసగిన అమృతాన్ని
నా హేమపాత్రలో అందించాను
తొలినాళ్ల తియ్యదనము
లోపించిందని అనుమానమా ?

## 20

వికసించిన ప్రసూనము
క్రమేణ పరిమళించింది
దోరమగ్గి పండైనది
అనుదినము తీపి అధికమైనది.

## 21

అన్న మాటలు అర్థము కాలేదు
సంకేతాలుగానే మౌనము వహించాయి చాలా కాలము
వ్యాఖ్యానాలు వెలువడ్డాయి
తళతళ లాడాయి ఆమె యువ విలాసాలు!

## 22

ఏరి కోసిన పువ్వులతో నింపింది
నా ఉత్తరీయాంచలమును
రిక్త కరములతో వెళ్లింది
సంధ్యాదేవి వలె
మాలగ కట్టి మెడలో వేయ మని అర్థమా ?
హర్ష సూచనములుగ
ఉంచుకొని వాసన చూడమని అర్థమా ?

## 23

వదలివేసిన రేవున
కూలిన మెట్లపై కూర్చుని
సంధ్యార్చన చేయుచున్నాడు యోగపుంగవుడు
నీరములపై దీపపు ప్రమిదను తేల్చుటకు
వచ్చినది విలాసిని
ముక్త కేశముల సౌరభ తమస్సులతో !

**24**

పూసిన గంధమును
గుర్తుపట్టినది రాధ
కృష్ణాష్టమి సంధ్యా నికుంజములలో
కృష్ణుడు మాటుననే దాగియుండెను
వాసన గుమగుమలు రాధను క్రమ్మివేయ
నలు దిక్కుల వెదకుచునే యుండెను.

**25**

కృష్ణుడు సహస్రావధాని
ఎంతమంది గోపికలు కూడితే
అంత సంతోషము, ఉల్లాసము !
చతురోక్తుల నాడువాడు
సమస్యల పూరించువాడు
నిషిద్ధాక్షరముల నెపముతో
పెదవుల మూయువాడు
సంయుక్తాక్షరము లంటూ
కౌగలించువాడు
బుజ్జగించుచు బుగ్గల తడుమువాడు
కవ్వించువాడు, కలతపెట్టువాడు
శృంగార హేలలతో అలరించువాడు !

## 26

నావ గమ్యస్థానము చేరి
లంగరు వేయు లోపల
పెక్కు రేవుల పలుకరించుచు పోతుంది
రాధ చుక్కాని పట్ట
తెడ్డులు విసరు వాడు కృష్ణుడు !

## 27

ధర్మార్థ కామ మోక్షములకు
సంకేత ధామము కృష్ణ నామధేయము
ధర్మాన్ని బోధించువాడు
అర్థానికై రాయబారముల జరుపువాడు
కామించి మోక్షము నిచ్చువాడు !

## 28

రాముడు చేసినటుల చేయండి
కృష్ణుడు చెప్పినటుల చేయం డని
ఊరకనే అన్నారా పెద్దలు ?
ఒకడు ఆచరణ శూరుడు
ఒకడు జ్ఞానోపదేశకుడు !

## 29

ఆచరణ లేని జ్ఞానము వ్యర్థము
జ్ఞానము లేని కార్యము శూన్యము
రెండింటి మేళవింపే రామ కృష్ణులు
వేదాంత సారమే రామకృష్ణులు !

## 30

రాధ గాలమునకు పడ్డ చేపా కృష్ణుడు ?
కృష్ణుని గాలమునకు పడ్డ చేపా రాధ ?
అనునది అనాదిగ వచ్చుచున్న ప్రశ్నే
శివుడు, విష్ణువు పూరించలేని సమస్య
వ్యాస వాల్మీకులు పూర్తి చేయని శ్లోకపాదము !

## 31

విజ్ఞాన క్షితిజములు విస్తరిల్లుచున్నాయి
సమర పరికరాలు వినాశ తాండవము సల్పుచున్నాయి
మన్మథుడు పెరగక ఎదగక
వామనుడుగనే ఉన్నాడా ?
ఇంకా పుష్పబాణుడు
పంచ కుసుమములతోనే తృప్తిపడుతాడా ?

## 32

మన్మథుడు శివునిచే భస్మము
చేయబడినవాడే కావచ్చును
కుసుమశరుడే కావచ్చును
అట్లని ప్రకృతి ఊరక ఉన్నదా ?
ఎన్నడు ఎరుగని జనాభాను మోస్తున్నది ధరణి
నేటి సంతానము
నిన్న లెక్కలతో పోల్చుకొని
హర్షముతో గంతు లిడుచున్నది
మన్మథుని మించి ఏవో అదృశ్య శక్తులు
మంత్రించి మైమరపించుచున్నవా ?
సినిమాలా, టి. వి.లా ?
కాలేజీలా, కచ్చేరీలా ?

## 33

ప్రకృతికి పెద్ద గడియారము సూర్యుడు
ప్రొద్దును తెలిపేవాడు
చీకట్లు, మబ్బులు క్రమ్మివేయవచ్చును
నా చిన్ని గడియారాన్ని అవి ఏమీ చేయజాలవు !

## 34

బయట ప్రపంచములో
ప్రమాదాలు పెద్దవానికే
గ్రహణాలు సూర్య చంద్రులకే
నక్షత్రాలకు కాదు;
తుపాను భయాలు వృక్షాలకే
తృణాలకు కాదు!

**35**

ఆరోగ్యము ఫర్వాలేదు
బండిని నెట్టుకొని వస్తున్నాను
అనేవాడు యార్లగడ్డ వెంకన్న చౌదరి
నెట్టుకొనే బండ్లకు అపాయము లేదు
వడిగా పరుగెత్తే బండ్లకే ప్రమాదము !

**36**

చిగురు టాకులలో దాగిన పువ్వు గుర్తులు తెలియవు
దాని సువాసన గుట్టు బయలుపెట్టింది
ప్రేమ రహస్యాలను
ఉత్తరము ప్రకటించివేసినది
అభిసార విలాసములను
కాలి జాడలు దండోరా వేశాయి !

**37**

కందకాలు. కాపలా వారు
చుట్టూ ఉన్నా
అంతఃపురపు గుట్టులు బయటికి వస్తాయి
దాసీ జనాలె గుట్టుగా చెప్పేస్తారు.

## 38

స్పర్శకు అర్థాలు వేరు
పాదస్పర్శ భక్తిని తెలిపేది
కరస్పర్శ స్నేహాన్ని తెలిపేది
కపోలస్పర్శ వాత్సల్యాన్ని తెలిపేది
కేశస్పర్శ ఆగ్రహాన్ని తెలిపేది
అధరస్పర్శ ప్రేమను తెలిపేది
తనుస్పర్శ అన్నిటినీ తెలిపేది !

## 39

జ్ఞాపక ముంచుకొని
ఆలోచించి మాట్లాడేది మానవుడు
పాపాలు చేసేదీ మానవుడే
బట్టలు ధరించేదీ మానవుడే
మరేదీ ధరించని వస్త్రములను
మానవుడే ఎందుకు ధరిస్తాడు ?

## 40

మానవునిలో ప్రత్యేకతలు చాలా !
ఆ ప్రత్యేకతలతోనే
ముందు యుగాలకు వికసిస్తాడు
ఇక వెయ్యి సంవత్సరాలకు ఎట్లా ఉంటాడో
పది వేల ఏండ్లకు ఎట్లానో ?

41

బట్టలు లేకున్నా పక్షులకు ఈకె లున్నాయి
చెట్లకు ఆకు లున్నాయి
జంతువులకు దట్టమైన చర్మము ఉన్నది
ఏది చేసినా ప్రకృతి జాగ్రత్తగనే చేస్తుంది.

42

మూఢాచారాలను కప్పడానికి
పుస్తకాలు ఉన్నాయి
పుస్తకాలు మంచిని గాని చెడ్డను గాని
రుజువు చేసి ప్రమాణాల నిస్తాయి
పుస్తకాలు వ్రాసేది మనబోటి వాళ్లే
దేవ సమానులు కాదు, దివ్య ప్రాణులు కాదు.

43

కాలధర్మాన్ని బట్టి
వారి వారి దృక్పథాలను బట్టి
రచించారు, ఎక్కించారు తాళపత్రాల్లోకి
సంస్కృతములోనే, ఛందస్సులోనే చెప్పారు
అదే మారని, అన్ని కాలాల సత్య మని
ఎందుకు తలవాలి ?

**44**

మన అనుభవాలు ఏమైనాయి ?
మన వివేకము మాయమైనదా ?
మన ఉపజ్ఞ? లోక జ్ఞానమునకు విలువ లేదా?
అన్నిటినీ సమన్వయించుకొని
మన ఆచరణను నిర్ణయించుకోవాలి !

**45**

మన పూర్వులు చెప్పిన దంతా
కడపటి సత్యమా ?
వారు తిని మిగిల్చిన దానిని
మనము నెమరువేస్తుండాలా ?
వారు పాడిన పాటలే భజన చేస్తూ
నిత్యస్తోత్రాలను పఠించాలా ?
మనకూ కొంత బుద్ధి ఉన్నది కదా !

**46**

పూర్వులు చూపిన మార్గాలు
ప్రయాణ సూచనలే
అనుసరించి ముందుకు పొమ్మని సంజ్ఞలు;
అవి ప్రయాణ కరగోడలు కావు.

**47**

కాలి జాడలు
ఎంత దూరము వెడతారో తెలిపేవి
ముందు ఎంత ప్రయాణ మున్నదో
తెలిపే దారి నాలుకలు కావు.

## 48

రాజ్యాంగ చట్టములో
ఉన్న అధికారాలను, లేని అధికారాలను
ప్రెసిడెంటు ఉపయోగించా లని
కోరుతారు ప్రతిపక్ష నాయకులు
వారి వారి ఆగ్రహాలను బట్టి -
అట్లాగే గవర్నరు వ్యవహరిస్తే ఊరుకుంటారా?

## 49

ప్రెసిడెంటు అధికారాలు విస్తరిస్తే
పార్లమెంటు అధికారాలు తగ్గిన పన్నమాటే!
ప్రజాస్వామ్యము కురుచబడినట్లే
సంపాదించుకొన్న ప్రజా రాజ్యము
అట్టి ఉద్దేశ్యముతోనేనా ?

## 50

ప్రజలు సంపాదించుకొన్న అధికారాలను
క్రొత్త వ్యాఖ్యానాల నిచ్చి, వెనుకకు లాగుట
అభ్యుదయ వాదులకు పాడియా ?
అల ఒకచోట లేస్తే నీరు
మరొకచోట తగ్గదా ?

## 51

రాజ్యాంగచట్టము మనము తయారు చేసికొన్నదే
నేటి భావాలను బట్టి, అనుభవాలను బట్టి
మార్చుకోవచ్చునని అందులోనే ఉన్నదే
క్రొత్త దైవాన్ని సృష్టించుకొని
దానికి బానిసలు కావాలా ?

## 52

జీవించియున్న మన కొరకా రాజ్యాంగ చట్టము
లేక చనిపోయిన మన పెద్దల కొరకా ?
మన తెలివి తేటలు మూటకట్టి
పెద్దల సమాధులలో పూడ్చిపెట్టాలనా ?

## 53

ఉన్న చట్టానికి వ్యాఖ్యానము
చెప్పే అధికారము కోర్టువారిదే
కోర్టు తీర్పులను సవరించే
అధికారము కలదు పార్లమెంటుకు
సవరింప బడనంతవరకు
చట్టము చట్టమే !
సవరణ జరిగిన పిదప సవరణే చట్టము
కోడలు వచ్చువరకు అత్తదే పెత్తనము
తర్వాత అత్త సర్దుకొని పోవాలి !
లేదా అప్పగించి పోవాలి !

54

మానవుడు పుట్టిన చాలా యుగాలకు
పుట్టాడు దేవుడు
మానవుడు పుట్టించిన చిత్రములలో
పెద్ద చిత్రమే దైవము !

55

కొన్ని మతాలలో దేవుడు లేడు
కొన్ని మతాలలో అతి వాస్తవము దైవము !
కమ్యూనిస్టు దేశాలలో దేవుని ప్రసక్తి తక్కువ
ఇస్లాం దేశాలలో దేవుని ప్రస్తుతి ఎక్కువ !

56

వేద కాలములో దేవుడు
ముసుగులోనే ఉన్నాడు
ఉపనిషత్తుల కాలములో
కొంత బయట పడ్డాడు
పురాణాలు దేవుని
ఉత్సవాలు జరిపాయి
క్రైస్తవ మతము, ఇస్లాం మతము
పదే పదే దేవుని కొలుస్తుంటాయి !

57

వర్తమానము ఆమెకు అన్నీ ప్రసాదించింది
చదువు, అందము, పదవి, సంతానము
భవిష్యత్తు కూడ ఆమెను అదే రీతి సంరక్షించుగాత!
జీవిత సమరములో
భవిష్యత్తే కవచమై కాపాడుగాత!

58

కుడి చేతిలో అన్నీ అమరాయి
వలసిన సమర సామగ్రి
ఎడమ చేతిలో శీలము, సౌజన్యము, నీతి
డాలు వలె ఉపకరించాలి
కుడిచేయి కొట్టేది, ఎడమచేయి కాపాడేది!

59

వయస్సు, సౌందర్యము, అధికారము
మనిషిని ఎట్లయినా మలచవచ్చు
కళంక రాహిత్యమై, ప్రశాంతి నొసగవచ్చు
తుపాను కరములలో పడి
తెరచాపల చింపుకొని
ఆందోళనా తరంగములపై
ఇటు నటు దొర్లవచ్చును!

## 60

వర్తమాన దిగంతములు
ప్రభాత ప్రభా రంజితములై
భావి కాల మధ్యాహ్నాదులు సంధ్యలు
ప్రచండాతపములతోను
ధూళి దూసరిత ఉన్మత్త వాయువులతోను
ఛిన్నాభిన్నము కావచ్చును !

## 61

సీమంత సింధూరము వలె అరుణిమములై
శోభిల్లిన ఉదయాలు
సంధ్యాకాశమున హరి విల్లులతో
సప్తవర్ణ సంయోగములతో రాణించుగాత !

## 62

మంచు స్నానముతో తెల్లనైన తామర
జీవిత యానములో, దుమ్ము ప్రాలని రేకుల విచ్చి
పూర్ణముగ వికసించి, పరిమళించి
ఆత్మసంతృప్తిని, ప్రజా గౌరవమును పొందునుగాత !

## 63

ఆత్మానంపములో ఆమె సౌజన్యమును చూచి
రోజా మొగ్గ అన్నాను
గులాబీ కళికయై, నిజ సౌందర్యాన్ని, సుగంధాన్ని
సాయం సమయాల చూపి, సంతస పరచు గాత!

64

ప్రొద్దుటి వాగ్దానము
కార్యాచరణ రూపమున సఫలమై
దినాంతమున సంపూర్ణతను పొందుగాత !
పిందె పండి తియ్యని పండు అగుగాత !
మబ్బులు లేని మునిమాపులో
కొండ చుక్క వలె రాణించు గాత !

65

ఆమె సుగుణ సంపదలే
బ్రతుకు దారి ప్రయాణములో
పెక్కు విపత్తుల సృష్టింపవచ్చును
ఆ చిక్కులనే మెట్లుగా చెక్కుకొని
ఎక్కవలసిన గుట్టలను దాటును గాత!

66

మంచికే పరీక్షలు
ఉన్నతాలకే పతనము
బంగారుకే పుటములు
సత్య హరిశ్చంద్రునికే విశ్వామిత్రుని పరీక్షలు !

67

చందన తరువునే నాగులు చుట్టేది
ఉన్నత గిరి శిఖరాలనే హిమములు కప్పేది
గట్టి ఇనుమునే కాల్చి సుత్తితో కొట్టేది
శ్రీరామచంద్రునికే వన వాసాలు !

## 68

నవలాకారుడు మరణించెను
కడపటి అధ్యాయముల పూర్తిచేయకనే
ప్రచురణకర్తలు పూర్తిచేసి ప్రచురించారు
నవలాకారునికి ఉన్న పేరు పోయింది !

## 69

"దేశము అనేక క్లిష్టసమస్యలను ఎదుర్కొనుచుంటే
కాంగ్రెసు ప్రభుత్వాలు
మద్యముమీదా, దేవదాసీలమీదా
చర్చిస్తున్నాయి" అన్నాడు
సి.ఆర్. రెడ్డి 37వ సంవత్సరములో ఛలోక్తిగ !

## 70

తీవ్రమైన సంఘర్షణతో
జరిగింది ఐదు దినాల క్రికెట్ మ్యాచ్
ఐదవ దినమున ఆఖరి వికెట్ పడలేదు
ఆశించిన విజయము ప్రాప్తికాలేదు

## 71

నీ వొసగిన అమృతాన్ని
నా హేమపాత్రలో అందిచ్చాను
తొలినాటి తీపి
లోపించిందని అనుమానమా ?

## 72

పెక్కుమందిని పెక్కు విధాల
అభిమానిస్తాము, గౌరవిస్తాము;
వాత్సల్య భావముతో చూస్తాము,
ప్రేమిస్తాము !
ఎదుటివారి మనోభావాలు
మనకు ఎరుకే ఉండవు
చీకటిలో గుడ్డివాని తడుముకోవడాలు !

## 73

అభిమానాలకు, అనురాగాలకు
అద్దాలు లేవు-ప్రతిరూపుల చూచుకొనుటకు;
ఒక వైపుననే ప్రయాణము
మరలి వచ్చుటకు వీలులేని ప్రయాణము !

## 74

జీవన ప్రయాణములో
అనేక సమరాలు జరుపుతూ పోతాము
కొట్టుతాము, దెబ్బలు తింటాము
పడుతాము, లేస్తాము !

## 75

దెబ్బలు తినేది
శత్రువుల చేతుల్లోనే కాదు
మన చేతులతోనే కొట్టుకుంటాము
మన కరవాలాలే గాయపరుస్తాయి
మన నాలుకలే గుండెను నొప్పిస్తాయి
తేలికగా అన్న మాటలు
పెద్ద బాధనే కలిగిస్తాయి !

## 76

వ్యర్థముగా మాట్లాడుతాము
సంబంధము లేని విషయాలే చర్చిస్తాము
ఇతరులను కొట్టుటే కాక
మన నెత్తిమీదే కొట్టుకొంటాము
హసిస్తూనే రక్తపానము చేస్తాము
ఇతరులదీ మనదీ కూడ!

## 77

విషానికి విరుగుడు లున్నాయి
శాపానికి తిరుగుడు లున్నాయి
శస్త్రాస్త్రిలను ఉపసంహరించుకోవచ్చు
అన్న మాటకు తిరుగు లేదన్న మాట !

## 78

చేసిన తప్పు చెప్పితే
పోతుం దంటారు
పలికిన తప్పు పశ్చాత్తాపముతో
పోతుందా ?
క్షమాపణ కోరుటతో పోతుందా ?
మాట తప్పు మరలా ఆడకుండుటచేతనే పోతుంది.

## 79

మనస్సు ఒక మర్కటము
పంచేంద్రియముల ద్వారా
దాని చేష్టల ప్రకటిస్తుంది
ఇకిలిస్తుంది, గోకుతుంది, రక్కుతుంది
గుర్రు మంటుంది, భయపెట్టుతుంది.

## 80

మనస్సు యజమాని
పంచేంద్రియాలు నౌకర్లు
మనస్సు కనబడదు
నౌకర్లే అన్నిపనులు చేస్తుంటారు.

## 81

కానిపించని దైవము
కానిపించే ప్రకృతి
కానిపించని మనస్సు
కానిపించే ఇంద్రియాలు !

## 82

కాన్పించనిది సత్యము
కాన్పించేది మాయ
అంటారేమో వేదాంతులు
కాన్పించనిదే ఎక్కువ విలువ
కాన్పించేది చౌక బేరము !

## 83

పురములో అంతఃపురము
అందాల రాణులు కనబడరు
దాసదాసీలు తిరుగాడుచుంటారు
మూగ సైగలతో చిన్న మాటలతో
పనులు చేస్తూ ఉంటారు.

## 84

పుష్పము కాన్పిస్తుంది
పరిమళము దాగి యుంటుంది
మబ్బులు ఎగురుచూ ఉంటాయి
వాన చినుకులు దూకుచుంటాయి
పుట్టలలోని పురుగుల వలె !

## 85

విలువలేని రాళ్ల రప్పలు
కన్పిస్తాయి
విలువయైన బంగారు వెండి
లోతున దాగి యుంటాయి.
కనబడే అగ్ని పర్వతాలు
కనబడని వేడి లావాను ఉమిసి వేస్తుంటాయి.

## 86

ప్రేక్షకులను ఆనంద పరచేవి
ఫిడేలు, మృదంగము
గాయకుని శ్రుతిలో నిలిపేది
తంబురాల మార్పులేని నాదమే !

## 87

సచిత్ర వారపత్రికలలో
పవిత్రలైన సీతా సావిత్రుల
బొమ్మ లుండవు
తెరల తార లగు
తలోదరుల, తలిరుబోడుల
బొమ్మలతోనే నిండి ఉంటాయి !

## 88

సాధారణముగ చేయని పనులను
కొన్ని వేళల చేసి ఒప్పు అనిపిస్తాము
కారు వెనుక సీటులో
ఇద్దరు ఆడవారు ఒక మగవాడు
కూర్చుంటే తప్పు లేదు గదా
అదే ఇంటి సోఫామీద తప్పు గదా !

## 89

రాజభవన్ డిన్నరులో
ఇద్దరు పరాయి పడతుల మధ్య
కూర్చుని మాట్లాడుచు నవ్వుతుంటే
రాజమర్యాద గదా !
ఇంట్లో అట్లా నవ్వుతుంటే
ఇల్లాలు ఊరుకుంటుందా ?

## 90

స్త్రీ పురుషుల సామీప్యాలు, సంభాషణలు
ఇంట్లో తప్పు;
అందరూ చూస్తున్న తావులలో
ఒప్పేకాదు; మర్యాద కూడ !

## 91

సంప్రదాయం కుంటుచూ
వెనుక బడుతుంటే
ఆధునికత ఎగురుచూ
ముందుకు నెట్టుకొని వస్తున్నది.

## 92

బాల విధవా వివాహాలకు
తిట్టిపోశారు వీరేశలింగాన్ని
విధవలకు మారు మనువులు జరుగుతుంటే
ఏమంటారు మనువు గారి శిష్యులు ?

## 93

ఒకనాడు మను ధర్మశాస్త్రాన్ని
తగులపెట్టింది పెద్దాడ కామేశ్వరమ్మ
రాజమండ్రి వీథులలో
ఈ నాడు ఎవడైనా అచ్చు వేస్తే
వెర్రి వెంగళప్ప అంటారు నవ యువకులు !

## 94

అప్పకవి, చిన్నయసూరి
ఇంకా బ్రతికి యున్నారా ?
సాహిత్య సభా మండపాలలో
ఆత్మహత్య చేసికోలేదా ?
లేక ఉరితీశారా ప్రజలు ?

## 95

దేశ దాస్యవిముక్తి ఎంత అవసరమో
సంఘ విముక్తి, భాషా విముక్తి
ఎక్కువ అవసరాలు;
అన్నిరకాల వెనుకబడిన తనాన్ని
పారద్రోలాలి !

## 96

వరదలు, కరువులు
దాగుడుమూత లాడుచున్నాయి
విచ్చలవిడిగ నీరు పొర్లడము
పశువులకు నీళ్లు లేకపోవడము
ఏమిటో ఈ వింత వైపరీత్యాలు?
ఏది ఎక్కువ ప్రజావీడతో పరీక్ష చేసికొంటాయో ?
రాహుకేతువుల సరస, విరస క్రీడలా ?

## 97

నేటి యువ విద్యార్థులు
భావి సమాజపు పునాదులు
దేశ నిర్మాతలు, భాషా పరివర్ధకులు
భవిష్యత్తుకు కరదీపికలు !

## 98

జననీ జనకుల ఆకాంక్షా ధామాలు
స్వప్న పరిమాణాలు
నవీనత శంఖారావాలు
విజ్ఞానయుగ వారసులు
నేటి విద్యార్థి బృందాలు!

## 99

ముందు తరాలకు వేగుచుక్కలు
ఉదయ శుక్ర తారలు
పాల ముంచినా, నీట ముంచినా
వారే బాధ్యత వహించేవారు
వారి శ్రేయస్సే దేశ శ్రేయస్సు!

## 100

భవిష్యత్తు దుర్గ రక్షకులు
నవయుగ వైతాళికులు
భావి సమాజ భాగ్య విధాతలు
మంగళ గాయకులు
విజయ పతాకా వాహకులు
ఆగామి స్రష్టలు!

## 101

20 వ శతాబ్దపు భుజాలమీద కూర్చొని
ముందు శతాబ్దాలను అన్వేషిస్తున్నారు
అకుంఠిత దీక్ష, అపూర్వ ఉత్సాహము
వారి వీపుల తట్టి నడిపించు గాత!

## 102

రామనవమి నాడు అయోధ్యను చూచాను
కృష్ణాష్టమినాడు మధురలో ఉన్నాను
బుద్ధుని లుంబిని చూచాను
క్రీస్తు పుట్టిన బెతల్‌హాం దర్శించాను
80 సంవత్సరములు నాకు నిండిన యేడు
గాంధీజీ పుట్టిన పోర్‌బందరు యాత్ర
పుట్టిన నాడు చేయాలని తలచాను.

## 103

ఈ ఏడు నా జీవితములో ముఖ్యమైనది
80 సంవత్సరములు నిండాయి
50 సంవత్సరాల పూర్వము మంత్రినైనాను
40 సంవత్సరాల స్వరాజ్యము చూచాను
10 సంవత్సరాలు సొంత సాహిత్యకృషి సలిపాను
వృద్ధ వటవృక్షము మాదిరి
నిడివగుచున్న జాడల గమనిస్తున్నాను

## 104

కవికి జరిగిన సన్మానాలు
వచ్చిన బహుమతులు
రానున్న, రావలసిన
బహుమతి సౌధ సోపానాలు!
పూసిన పూలు
వచ్చే పిందెలకు, పండ్లకు
పీఠికలు వ్రాస్తాయి !

## 105

'ఏమి పుచ్చుకొంటారు?' అన్నది ఆప్యాయముగ
'ఏమీ వద్దమ్మా, మీరు పెంచుతున్న
తోటలోని పువ్వును ఇవ్వండి' అన్నాను
కొత్తరకపు గులాబీ పువ్వును ఇస్తూ
'మీరేమీ తీసుకోకుండా పోతే
మాకు తృప్తిగా ఉండదు' అన్నది మరలా
'తాగిందో తిన్నదో అదృశ్యమై పోతుంది
పువ్వు సాయంత్రము వరకు
నా చేతిలోనే ఉంటుంది.
దాని అందాన్ని చూస్తాను, వాసన పీలుస్తాను
అది మీ ఆప్యాయత చిహ్నమే గదా !'

### 106

'పంచ అంచు నేలపై జీరాడుతున్నది
జాగ్రత్త, పడతారు సుమా!' అన్నది
'పడవలసియుంటే, ఇక్కడే పడితే మంచిది గదా!
రోడ్డులో పడితే ప్రమాదము
ఇక్కడ మీరు చికిత్స చేస్తారు
అవసరమైతే మీ కారులోనే
ఆసుపత్రికి పంపిస్తారు!'

### 167

కవులు వాడిన ప్రసిద్ధ అసత్యాలు
కవి సమయాలు
అవే కవి సందర్భాలు
'ఆడవే మయూరి' అంటారు కవులు
ఆడ నెమలి ఆడదు
కవిత్వములో ఆడుతుంది
కవి సమయములో ఆడుతుంది!

### 108

పెద్దపులిని అరణ్యములో చూస్తే
అదిరిపోతాము
జూలో చూస్తే దయ పుట్టుతుంది
సర్కస్‌లో చూస్తే జాలివేస్తుంది!

109

ప్రధానమంత్రిని అనుసరించే
ముఖ్యమంత్రిని చూస్తూంటే
వింతగా ఉంటుంది.
చీకాకు పడుతాడు, కోప్పడుతాడు
నీవు నీవు అనుకొంటారు;
ఈయనా, ఆయనా కాంగ్రెసు మంత్రులే!

110

'పూల దండ లన్నీ
ప్రధాని మెడలోనేనా?
వీరందరూ నన్ను ఎన్నుకొంటిరే!
రాష్ట్రములో నేను పాలన చేస్తున్నానే!'
అని స్వగతంలో అనుకొంటాడు.

111

ప్రధాని రాష్ట్రము వీడిన తర్వాత
అణచుకొన్న ఆవేశాలు
పైకి ఎగురుతాయి
పత్రికా గోష్ఠిలో
'ప్రధాని పర్యటనలు
రాజకీయ భావ ప్రేరితాలు'
అని కనుబొమలు చిట్లించి అంటాడు.

## 112

వచన కవిత్వం చదువుతూ
'కవిత వచనము మాదిరి ఉందే
యతిప్రాసలు, అంత్యానుప్రాసలు
అందమైన నడక లోపించిందే'
అని విమర్శిస్తే ఎట్లా ?
బజారులోనికి పోయి సందడిగా
ఉన్నదే అని విసుక్కుంటే పోతుందా ?
ఢిల్లీకి పోయి హిందీ మాట్లాడేవారు
కొంత ఎక్కువగా ఉన్నారే
అని వాపోతే పోతుందా ?

## 113

వచన రూపములో
కవితా భావాలు గోచరించాలె
పరిమళాలు గుబాళించాలె
వెదురులో వేణువును చూడాలె
వందేమాతరంలో స్వరాజ్యాన్ని చూడాలె
జాతీయ పతాకములో
సాధించిన తీరును చూడాలె!

## 114

కవిత అంతా రస భూయిష్ఠముగ
లేదని విమర్శిస్తారు, వాపోవుతారు.
అంతా తీపియైతే వెగటు వేస్తుంది
గగన మంతా తారలైతే
విసుగు పుట్టుతుంది
సభ అంతా మహిళలైతే
సరసముగ ఉంటుందా ?

## 115

వ్యాకరణ పరిశుద్ధతను
నేటి సాహిత్యములో వెతికితే ఎట్లా ?
సాహిత్యపు పరుగులకు తట్టుకోలేక
చతికిలపడింది వ్యాకరణము
కాలము స్తంభించి, కూర్చుని లేదని
రుజువు చేస్తున్నది ప్రజాస్వామ్యము !

## 116

మాట్లాడేటప్పుడు
చేతులు ఎందుకు త్రిప్పుతాము ?
మాటలకు చేతులకు
ఏమి సంబంధము ?
మాటలకు పుష్టి ఇవ్వడానికి
చేతులు త్రిప్పుతాము.

## 120

రేడియో నాటికలలో
గొంతుతోనే రసాలు చిందించాలి
అందుకనే, రేడియో నాటకాలలో
రక్తికట్టించడం ఎక్కువ కష్ట మంటారు.

## 121

కృష్ణుడు, కర్ణుడు
కన్నతల్లి ప్రేమ తెలియని కవోదులు !
కర్ణుడికి అసలు తండ్రి ఎవరో తెలియునా ?

## 122

దేవకి ఎంత పరితపించేదో కృష్ణునికై
ఎన్ని నిట్టూర్పుల విడిచేదో
కృష్ణుని గారాబు ప్రేమ లన్నీ
యశోదకే దక్కాయి
ఎవరి అదృష్టము వారిదే గదా !

## 123

శకుంతలకు
తాను మేనకా విశ్వామిత్రుల తనయ నని తెలియునా ?
తల్లి, తండ్రి కణ్వమహర్షి యనే తలచినదా ?
పెళ్లిలేని ఋషులకు సంతాన ముండ దని తెలియని
అమాయకురాలు కాదు శకుంతల !

## 127

మతము పేరుతో
నిరపరాధుల, నిస్సహాయుల, నిర్ధితుల
కాల్చి చంపుట న్యాయ మంటారు
తీవ్రవాదుల వీరపురుషులు!
నమ్మిన సిద్ధాంతానికి
కట్టుబడి ఉన్నా మంటారు
మతోన్మాద శూరులు!

## 128

కలుషిత మైనాయి
మతగ్రంథాల పుటలు
పూజా గృహాలలో
చెదలు చేరి పుణ్యాన్ని కొట్టివేస్తున్నాయి !

## 129

ఎందుకీ చెదలు తిన్న మతాలు!
ఎన్ని సమరాలు, ఎంత రక్తపాతము-
ఆదినుండి ఈ పుడమిలో ?
రక్త హోమగుండాలు, రుధిర స్నానాలు
'ఓం శాంతిః, శాంతిః' అంటూనే !

130

దేవుని తృప్తికోరకే గదా
ఈ దారుణ నరబలులు
ఆయన నిజముగ సంతుష్టి మందహాసాలు చేస్తాడా ?
ఆయన మౌన ముద్రాలంకారుడు
ఏమి చెప్పడు, ఏమీ చేయడు !

131

దయామయుడే దేవుడు
మాయ క్రమ్మింది మానవులకు
మతాలు క్రమ్మాయి దయామయునికి
ఎంత చెట్టుకు అంత గాలి !

132

పుకార్లు పుట్టించే వారికి
నిజాలతో ఏమి మజా ?
నిందారోపణ చేసేవారికి
రుజువులతో ఏమి నిమిత్తము ?
వాస్తవములతో ఏమి పని ?

## 138

నా రచనలు చూచిన కొందరికి
దేవునిలో నాకు విశ్వాసము లేదా
యను సంశయ మొచ్చింది
పురుషాకారములో గాని
స్త్రీ ఆకారములో గాని లేని
అలౌకిక శక్తి బ్రహ్మాండాన్ని
నడుపుచున్నదని విశ్వాసము నాకు!
కోరికల నిచ్చే దేవుడు కాడు
శిక్షించే దేవుడు కాడు
ఆ శక్తినే దేవుడని పిలువవచ్చును
అల్లా అనియు పిలువవచ్చును.

## 139

తిథి, ముహూర్తము లేక వివాహ మాడాను
మంత్రములతో నిమిత్తము లేక
త్రివేణిలో గంగోత్రిలో స్నానమాడాను
విగ్రహారాధనలో ఆట్టే నమ్మకము లేకనే
దేవాలయా లన్నీ దర్శించాను
స్వయముగా రాట్నము త్రిప్పకున్నా
1920 నుండి ఖద్దరునే వాడుచూ వచ్చాను.

140

నా అద్దము నన్ను చూచి నవ్వింది
'దాపటని తమ్ముడూ!' అని పిలిచింది
వార్ధక్య కలా నాటకుడు చాటువేయ
మస్తొ 'లిపి' ఎంత కప్పిపుచ్చినా
ఒంటి ముడతలు మెండుగనే ఉన్నవి
ముసలి రాజధాని నా శరీరము!

141

నల్ల వెంట్రుకలు తెల్లబారినవి
వలపువెలిన బట్టతల ఒళ్ళ గుడికి కలశమైనది
కృత్రిమ దంతములు నోటిలో పుష్పించినవి
దృష్టి మందగించి కంటి అద్దాలపై ఆధారము
వినికిడి తగ్గి, తప్పుటప్పు లగుచుంటాను
నలుని రూపు తలక్రిందులై మాయమైనది
అద్దము 'ముసలి సోదరా!' అని పిలిస్తే
నవ్వుతున్నదే కదా!

142

పుట్టిన దంతా చచ్చేదే
పుట్టి చచ్చేది దేవుడు కాదని నా విశ్వాసము
రాముడు, కృష్ణుడు, క్రీస్తు, మహమ్మద్
దేవుళ్లు కారు
దేవుడికి కొడుకులు లేరు, కోడళ్లు లేరు
వారు దైవాంశపూరితులైన మహా మానవులు!

## 143

చుట్టూ నిశీథ నిబిడ తిమిర రాశులు
పైన కోట్ల యోజనాల దూరములో
మినుకు మినుకు మను తారా దీపికలు
ఆ తారల సూక్ష్మ కాంతులు గూడా
చీకట్లో నా నడకలకు సాయపడ్డాయి.

## 144

త్యాగశీలుర సమాధులపై
కనక సింహాసనాలు చేరాయి
త్యాగ విభూతి ఎరుగని
కిరీటము ధరించకనే ప్రభుపుత్రి
గద్దె ఎక్కి తిష్ఠ వేశారు !

## 145

వదంతులు
పొగలేని నిప్పు మంటలుగా చెలరేగాయి
చివరకు నిప్పు ఆరి
పొగ మాత్రము కన్నుల కమ్మివేసింది !

## 148

ఆమరణ ఋణాలను
జన్మాంతరములో తీర్చవచ్చునని నమ్మిక
అధికతర ఆదరణతో, ఉపకారముతో
తీర్చగలమని విశ్వాసము
ఋణాలను కృతజ్ఞతలతో తీర్చివేస్తే
స్మరణ సంపదలుగా ఉండవని భయం!

## 149

ఆదరణ బహుమూల్యమైన సంపత్తి
ఆ సంపత్తుల భారాన్ని భుజాలమీద
మోస్తూ ఉంచాలని కోరిక
ఆ భారము క్లేశము కాదు
ఆనంద భరిత పరితృప్తి!

## 150

జానపద గీతము
ఏ శతాబ్దములో ఎవరు రచించారో
జానపదుల గొంతులలో నిలిచిన పాటను
టి.వి. లో పాడారు
పదిమంది వాద్యకారుల, జంత్రకారుల సాయముతో.

## 151

అనామికగా మసుచుండిన గీతాన్ని
రచ్చలోనికి ఈడ్చారు, వీధిలో పడవేశారు;
మరుగున ఉండిన మాధుర్యాన్ని
సంతలో చూపించారు, పేలవముగా తోచింది.
అనామిక విలపించే ఉంటుంది
నేరం గోరంత, అస్త్రం పట్టెడంత!

## 152

వర్ణాశ్రమ ధర్మము
నా సృష్టి అన్నాడు కృష్ణుడు గీతలో
పుట్టుకచేత కాక, గుణముచేత
నడవడిచేత నిర్ణయింపబడు నని
ఉదార వ్యాఖ్యానాలు వెలువడ్డాయి!

## 153

గుణముచేత, నడవడిచేత
ఎందరు బ్రాహ్మణు లైనారు?
ఎందరు శూద్రు లయ్యారు?
ఎందరు పంచము లైనారు ?
ఆచరణలో లేని వ్యాఖ్యానాలు
చేసిన ఫలిత మేది?
కురవని మబ్బులవల్ల లాభ మేమి?

## 154

ఎచ్చట లేని వర్ణాశ్రమ ధర్మాన్ని
సృష్టించుట ఎందులకు ?
అమలులో లేని వ్యాఖ్యానాలు చేయుట ఎందులకు ?
అదుపులో లేని భూతాన్ని
పుట్టించుకొని, నివ్వెరపడు టెందులకు ?

## 155

చరిత్రను పరీక్షిస్తే
ఏమి మిగులుతుంది
సమాజాన్ని చీలికలు చేసి
హెచ్చుతగ్గుల గోడలు కట్టారు
ఎందుకు సృష్టించారు ఈ గొడవంతా
ఛిన్నాభిన్నము చేసిన గందరగోళమంతా

## 156

నా సృష్టి అన్న కృష్ణుడు, బ్రాహ్మడుదయ్యాడా
యదుకుల తిలకముగనే నిలిచిపోయాడు
భగవద్గీత గొప్ప మతగ్రంథము కావచ్చును
హిందూమతసార మకరందమే గావచ్చును
వర్ణాశ్రమ ధర్మసూత్రముచేత
పాతికశాతం మార్కులు తగ్గాయి నా దృష్టిలో !

157

వర్ణాశ్రమ ధర్మముమీదనే
నిర్మింపబడ్డది హిందూమత సౌధము
హెచ్చుతగ్గుల మెట్టువర్ణాలు లేకుంటే
హిందూధర్మమే లేదన్నాడు
పెరియార్ రామస్వామి నాయకర్
వర్ణాశ్రమ ధర్మాన్ని వ్యతిరేకించాడు
హిందూమతాన్ని తిరస్కరించాడు

158

లాభము సున్న, నష్టము మెండు
అయినా ఈ ధర్మానికి ఎంత మొండి ఆయుస్సు
బుద్ధుని మొదలు రామస్వామివరకు
రామస్వామి చావువరకు ఎదిరించారు
చస్తుందనిపిస్తూ, చావకుండానే బ్రతికియున్నది

159

రామానుజులు, వేమన, బసవేశ్వర
పటీరాదులు ఎంత మొత్తుకున్నా
ఇప్పుడే చచ్చేటట్లు లేదు
శాపాలు పనిచేయని కాకి ఆయుస్సు

160

వర్తమానకాలములో ప్రజాస్వామికములో
కులాలు పడగలు విప్పి ఆడుచున్నాయి
సాధించిన స్వరాజ్యాన్ని కలుషితపరచాయి
పెద్ద గరళపు ముద్దనే మింగింది హిందూ ధర్మదేవత

161

నియమితులైన పాలకులు, అధికారులు
ప్రతిభవల్లకాక, కులాల ఊతకర్రలపైనే
పైకి ఎగురుచున్నారు
గంగోత్రిలోనే అపవిత్రమైన గంగ
అన్ని కాలువలను కలుషితమొనర్చుచున్నది

162

హిందూమతము నెట్టివేసేదేకాని
చేర్చుకొనేదికాదు
దేశంలోని ముస్లింలు, క్రైస్తవులు
శిక్కులు, ఎంతెంతమంది
ఒకనాడు హిందూమతములో ఉండి
అన్యమతాలను స్వీకరించినవారే

## 163

వలసపోయిన భారతీయులు
అన్యోన్యముగ పెండ్లి పేరంటాలు
చేసికొంటూ, కులాల మరచుటకు యత్నిస్తున్నారు
బొంబాయి రేవులో దిగగానే
ఏ కులంవారని అడిగి
కులాల స్మృతికి తెస్తున్నాము

## 164

వర్ణాశ్రమ ధర్మము
దానిపై వచ్చిన వ్యాఖ్యానాలు, టిప్పణులు
పెద్ద ఆత్మవంచన అని నా విశ్వాసము
పెద్ద తప్పు అనవచ్చు
సంఘాన్ని చీల్చింది అదే
దేశాన్ని విడగొట్టింది అదే
ఎన్ని శతాబ్దాల మొండి ఆయుస్సో చూడాలి
ఎన్ని యుగాల విరుగుడులేని శాపమో చూడాలి

## 165

ఋణము తీరిపోతే తృప్తి
చేసిన వాగ్దానము తీర్చుకొంటే తృప్తి
తలపెట్టిన పని నెరవేరితే తృప్తి
అనుకొన్న లక్ష్యాన్ని సాధిస్తే తృప్తి

## 166

తృప్తివెనుక ఆశలు ఆశయాలు
పెరుగుచునే ఉంటాయి
రేవు చేరగనే, పోవలసిన రేవులు కన్పిస్తుంటాయి
పోయినకొద్దీ దిగంతములు
దూరముగానే ఉంటాయి
వెనుకకు నడుస్తూనే ఉంటాయి

## 167

బయలుదేరినపుడు దిగంతములు
ఎంతదూరమో
వేయి యోజనాలు వెడలిన పిదపను
అంతేదూరములో ఉంటాయి
దిగంతములు చేరలేని ధామాలు
ఆహ్వానిస్తూ తిరోగమించే తిలోత్తములు
నిరంతర అస్పృషిత ఊర్వశులు

## 168

దిగంత దూరముల చేరుటకు
బయలుదేరింది మానవత్వము
మానవులు వ్యక్తులుగా మారుతు వస్తారు
మానవత్వము ప్రయాణము సాగిస్తూనే ఉన్నది
చేరుకొన్ననాడు, దివ్యత్వమై ప్రకాశిస్తుంది

### 169

వేషము వేయమన
ఆమె ప్రశంసను పొందాలని కోరిక
ఆమె ప్రశంసలో, ఆమె అనురాగము
తొణికిసలాడుచు నుంటుంది
అప్పుడే అనురాగములోని మాధుర్యము
పద్యాన్ని అనుమతిస్తుంది
అంటే, అదే దాని ఫలసిద్ధి

### 170

పరిచయమో, స్నేహమో, అనురాగమో
తెలియరాని సందె మసకల వేళలలో
స్నేహమని తలిస్తేనే మేలు
అనురాగమని భ్రమిస్తే ప్రమాదము కావచ్చును

### 171

పిరికిపందలు రాజ్యముల గెలువలేరు
పిరికివారు ప్రణయములో ముందుకు పోలేరు
సాహసవంతులే
కొత్త మాగాణముల దున్నగలరు
పిరికివారు గడిలో ఇరుక్కొని
అడుసులో మునిగి తంటాలు పడగలరు

## 172

రేరాణిగ వెలుగుల నిచ్చిన
వీధి విద్యుత్‌దీపము
పగటిపూట ఆర్పలేని స్థితిలో
కాంతిహీనమై అనాథయై విలపిస్తుంది

## 173

చీకట్లను వణకించివేసిన తుఫాను గాలులు
అలలను ఉవ్వెత్తున లేవనెత్తిన వడిగాలులు
చెట్లను కూలద్రోసిన విసురుగాలులు
నిర్వీర్యములై నిలిచిపోయినవి
వాయుగుండం తీరము దాటగానే

## 174

కనిపించని గాలికి ఇంతశక్తి ఎట్లా వచ్చిందో
ఇంతశక్తి ఎచ్చట దాగియుండిందో
పర్వతాల భోషాణములో అణగి ఉండిందా
తలుపుల తన్నుకొని పైకిలేచి రొప్పుతూ
జిల్లాలమీదికి దుమికిందా

175

గాలిలో ఎంత భీషణశక్తి
నీటిలో ఎంత ప్రచండశక్తి
అణువులో ఎంత మారణశక్తి
నిరాకారంగా, నిగూఢంగా కాన్పించే
ఏ ప్రజాశక్తి సామాన్యముకాదు
విప్లవాత్మకమైనదే, రాజుల త్రోసిపుచ్చేదే

176

కొన్ని లలితమైన పవిత్ర భావాలను
స్థూలమైన పదాలలోకి ఇరికించకుండా ఉండుటే మంచిది
ఆ భావాలు నీ సొంతాలు.
పదాల సంతలలోకి ఈడ్చుకుండుటే లగ్గు

177

దేవాలయాలకు వెళ్లదమెందులకు
అర్చటి నిషేధాజ్ఞలకు శపించుట ఎందులకు
నీ హృదయమందిరములో లేని దేవుడు
ఆ మందిరములో ఉన్నాడా ?

## 178

మస్జిద్‌లో మదిరమును త్రాగుచుండిన
గాలిబ్‌ను ముల్లాలు మందలించారు
పునీతమైన అల్లాస్థానమని అన్నారు
అల్లా లేని స్థలాన్ని చూపు
అచ్చటికే వెళ్లి త్రాగుతానన్నాడు గాలిబ్
ముల్లాలు తెల్లబోయారు
తబ్బిబ్బులైనారు

## 179

నాకు వచ్చిన జాబులను కాగితాలను
సర్చి, రిసర్చి చేసుకొంటుంటాను
నా ఇల్లాలు బీగములను పిన్నులను
సర్చి రీసర్చి చెసుకొంటుంది
ఆంధ్రప్రదేశ్ అవతరణ సందర్భముగ
పెట్టబొయ్యే హోంసైన్సు యూనివర్సిటీ
మా ఉభయులకు రిసర్చికిగా
పి.హెచ్‌డి, అంతకన్న పెద్దదో యిచ్చి
సన్మానింపకూడదా ?
చాన్సలర్ దృష్టికి ఎవరూ తేలేదు కాబోలు

## 180

నా అల్మైరాలో ఉన్న పుస్తకాలు
నా బీరువాలో ఉన్న బట్టలను
చూస్తుంటే, నామీద నాకే
జాలి వేస్తుంది, విసుగు పుట్టుతుంది
చిన్నవిషయాలను చక్కబెట్టలేని నేను
పెద్ద విషయాలను ఎట్లా చక్కబెట్టగలనని
ఆశ్చర్యమేస్తుంది

## 181

ఈ శతాబ్దములో మహిళలలో
పెద్ద అధికారము చెలాయించింది
ఇందిరాగాంధి
ఈ శతాబ్దపు ప్రథమ మహిళయై
పెద్ద ప్రజ్ఞలతో కీర్తిని పొందింది
సరోజినినాయుడు
సాహిత్యములో పెద్ద కవయిత్రిగ
పేరుగాంచినది, మరణానంతర పద్మవిభూషణ యైనది
మహాదేవివర్మ
పరదేశవాసియైనా, భారతీయ పౌరత్వాన్ని
స్వీకరించి సేవాధర్మమే రూపుగొన్న
నోబెల్ బహుమతి గ్రహీత
మదర్ థెరీసా

182

గుజరాత్ గీర్ అడవులలో
సజీవ వన్యసింహాలను చూచాము
ఫోటోగ్రాఫులు తీశాము
గుజరాతు సింహాలు
పంజాబు సింగులకన్న
అహింసామూర్తులుగ కాన్పించాయి
జైనమత ప్రభావమా, గాంధీతత్వమా

183

గుజరాత్ పదిదినాల తీర్థయాత్రలో
చూచిన దృశ్యాలను, పొందిన అనుభూతులను
నెమరువేసుకొంటుంటేనే
ఆనందాలు, ఆహ్లాదాలు
మదిలో పురి విప్పుచున్నాయి
రమ్యంగా మర్యాదగా జరిగిన తృప్తియాత్ర

184

ఒకవైపు గాంధి స్మారికలు, కీర్తిమందిరాలు
ఇంకొకవైపున
శ్రీకృష్ణుడు వివాహమాడి పాలించిన
ద్వారకానగరము
వేటకాని అంబునకు అసువులు బాయ
వేటకాని విలాపము, కృష్ణుని ఓర్పు ఓదార్పులు
గుజరాతు కళాశిల్పముతో
నిర్మాణమగుచున్న సోమనాథపురము

## 185

గుజరాతులో
చిన్నవి పెద్దవి స్వదేశ సంస్థానాలు
వందలమీద ఉండినాయి
వానిని భారతదేశముతో దీక్షతో విలీనమొనర్చిన
సర్దార్ పటేల్ పెద్ద విగ్రహాన్ని
సోమనాథమందిర సమ్ముఖమున
స్థాపించినారు
చారిత్రాత్మక యథార్థాలను
చిత్రించే విజయస్తంభమది
రాజకోట, జునాఘడ్, పోర్ బందరు
జాంనగరు విశేషాలను విన్నాము, కన్నాము

## 186

87 ఆగస్టులో స్వరాజ్యాధ్యాయం జరిగి
40 సంవత్సరాలు పూర్తి
ఆదే మాసములో నా వయస్సు
80 సంవత్సరాలు పూర్తి
జూలై మాసానికి నా మద్రాసు మంత్రిత్వానికి
50 సంవత్సరాలు పూర్తి
దీని శుభస్మరణ ఫలస్వరూపము
గాంధి పుట్టినరోజు, పుట్టిన స్థలాన్ని
దర్శింప సంకల్పము
సతీసమేతముగ బయలుదేరాము
హైదరాబాదు ఇద్దరు స్నేహితులు
కలిశారు మా తీర్థయాత్రలో
సుఖముగ ఆనందదాయకముగ
జరిగింది మా నవజీవన యాత్ర

187

నా విద్యార్థిదశలో బందరు జాతీయ
కళాశాలలో ఒక సంవత్సరము
చొక్కా తొడగలేదు
దిగుమతి యగుచుండిన చక్కెర వాడలేదు
ఆ దినాల పరిత్యజనల వర్ధంతిగ
పోరుబందరులో చొక్కా వేయలేదు
చక్కెర వాడలేదు

188

అహమ్మదాబాదులో తొలుత
సబర్మతీ ఆశ్రమాన్ని దర్శించాము
సబర్మతీ నదీతీరాన పునీత స్థలాన
గాంధి సంధ్యా ప్రార్థనల స్మరించాము
నివాసపు గదిని,
రాట్నము త్రిప్పే స్థలాన్ని చూచాము
1930 మార్చి 12 తేదీన ఉప్పు సత్యాగ్రహమునకై
సత్యాగ్రహ వీరయోధులతో
దండీతీరమునకు బయలుదేరిన దృశ్యాన్ని స్మరించాము
వేలాది ప్రజలు నిశ్చేష్టులై చూచుచుండ
పాదయాత్రలో బయలుదేరిన అహింసా సైనికుల
మూర్తులు స్మరణవీథికలలో మసిలినాయి

## 189

వారు వినియోగించిన వస్తువుల
ప్రదర్శనశాలను దర్శించాము
ఆ స్మారికలు, చిత్తరువులు
త్యాగగరిమ రూపుగొన్న వాస్తవాలు
చరిత్రకు వదలిన పునీత అవశేషాలు
భవిష్యత్తుకు వారసత్వముగ ఇడిన హస్తముద్రలు

## 190

అట్టి మహనీయుడు త్యాగశీలి పుట్టి
ఆ సేతుహిమాచలము ఉత్తేజపరిచాడని
రానున్న తరాలు శతాబ్దాలు
విశ్వసింపజాలరేమో యని అన్నాడు
అగ్రవిజ్ఞానవేత్త ఐన్‌స్టీన్
గాంధిని కలిసిన పిదప

## 191

పురాణాలు ఊహించని
ఇతిహాసాలు తలపెట్టని
అహింసామూర్తి, త్యాగనిరతుడు
అశేషజననాయకుడు
ఊహాతీతమైన మహామానవుడు గాంధి

**192**

జన్మనికేతనమైన పోరుబందరు
సబర్మతీ ఆశ్రమము
యరవాడ జైలు
వార్ధా సమీపపు సేవాగ్రామము
నిర్యాణము చెందిన బిర్లా భవనము
దహనము చేసిన రాజఘాట్
వారి జీవితముతో ముడిపడిన తీర్థధామాలు

**193**

ప్రారంభించిన సత్యాగ్రహ ఉద్యమాలు
రాట్నము సంకేతముగా గ్రామీణ పరిశ్రమలు
హరిజనోద్ధరణ
టక్కర్ బాబావంటి నాయకుల నేతృత్వములో
మన్యప్రాంతాల వికాసము
శాసనోల్లంఘన
అహింసా సత్యాలపై వారి అకుంఠిత దీక్ష
సమాజాన్ని ఉత్తేజపరిచేవే
నూతన చైతన్యముతో పల్లవింపచేసేవే
పుట్టని తరాలు స్మరించే విప్లవకారియే
శాంతికాముకుడే గాంధి

## 194

దశావతారాల పట్టిక చూస్తుంటే
వింతగా ఉంటుంది
కొందరిని అవతారాలుగా
ఎందుకు గుణించారో
ఏ అధికారముతో, ఏ ప్రశస్త కార్యముతో
బలరాముడు అవతారపురుషు డయ్యాడో
బాగే తాగేవాడు, కౌరవ పక్షపాతి
అగస్త్య భ్రాతయనా ?

## 195

పరశురాముడు అంతే
క్షత్రియుల పొగరు అణచాడనా ?
హంతమార్చాడనా ?
హింసను హింసతో పరిసమాప్తము
చేయాలని చూచాడని
వినోబాభావే అధిక్షేపించాడు
శ్రీరాముని వివాహాన్ని వ్యతిరేకించాడు
ఉత్తరప్రదేశ్‌లో గంగాతీరములో
దోహరిఘాట్ వద్ద పరశురాముడు
సవాలు చేశాడు
ఇద్దరు హీరులు ఢీకొన్న చోటు

**196**

మత్స్య కూర్మ వరాహముల
అవతారములుగా చిత్రించినవారు
బలరాముని పరశురాముని
అవతారాలుగా భావించడములో
ఆక్షేపణ ఎందులకంటే జవాబు చెప్పలేను

**197**

బౌద్ధుల ఒత్తిడులకు తాళలేక
బుద్ధునికూడా అవతారాలలో చేర్చారు
ఒత్తిడి చేసుంటే దూర్వాసుని
విశ్వామిత్రుని చేర్చి ఉండేవారే
గాలికి తగ్గ తెర ఎత్తేవారికి
ఏదైనా సాధ్యమే

**198**

పర్వదినాలనాడు దేవమందిరాలకు వెళ్లను
నేను గౌరవించే పెద్దలను దర్శించుకొంటాను
పెద్దల ఆకారములోగల దైవాంశను
చూచి సంతోషిస్తాను
లేకుంటే రవీంద్రుని పుస్తకాలు పఠిస్తాను
ప్రకృతిని ఆరాధించినవాడు రవీంద్రుడు

199

దేవాలయాలకు వెళ్లని కోట్లలో
నేనూ ఒకడను
ఇతర మతాలవారే కాక
ఆర్యసమాజము, బ్రహ్మసమాజము,
తియాసఫీవారు, కమ్యూనిష్టులు, రేషనలిస్టులు
మందిరాలకు వెళ్లరు
చావుతర్వాత
వారందరు ఎక్కడికి వెళ్లతారో
ఆక్కడికి నేనూ సంసిద్ధం

200

దేవాలయాలకు వెళ్లితే వెళ్లుతాను
నదులలో స్నానము చేస్తాను
వైకుంఠ సోపానములని కాదు
కళానైపుణ్యాన్ని చూడడానికి
పారే నీళ్లల్లో స్నానము చేయడానికి,
పుణ్యము ప్రాప్తిస్తుందని మాత్రము కాదు

## 201

ముహూర్తముతో నిమిత్తము లేకనే
వివాహమాడాను, రవీంద్రుని జన్మదినాన
తెలుగులోనే ప్రతిజ్ఞలు చేయించారు
హోమాలు లేవు, మంత్రాలు లేవు
అది చట్టబద్ధమేనా యని నా హితైషి
లేవనెత్తాడు
చట్టము ఒప్పుకున్నా, మా దంపతులు
భయపడుటలేదని చెప్పాము
ఏబది సంవత్సరాలు కావచ్చినది
మంత్రులు, జడ్జీల సమక్షములో జరిగిన పెండ్లి

## 202

విదేశాలలో భార్య కాకుండా
మాతృత్వము కోరే మహిళలున్నారు
భార్యయై, మాతృత్వము కోరని
మహిళలు ఉన్నారు
భార్య కాకుండ మాతృత్వము కోరని
మహిళలు ఉన్నారు
మహిళా స్వాతంత్ర్యపు దినాలివి
21వ శతాబ్దములో ఈ స్వేచ్ఛ
ఏ స్వరాన వీణారావము చేస్తుందో

**203**

సంఘం ఒప్పిందా లేదా
అనే ప్రశ్నే లేదు
ఒప్పకుంటే, సంఘాన్నే ఏద్వమను
అంటారు నవీన యువకులు
వెలివేయడం, సంఘ బహిష్కారము
ఉళక్కి మాటలు
నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు
అన్నాడు కృష్ణశాస్త్రి ఏనాడో
దాన్నే ఇంకొంత చమత్కారముతో
సమర్థించాడు గుడిపాటి.

**204**

పదాకులు మారుమనుములు
పరిపాటి యగుచున్న యుగములో
వీరేశలింగాలతో పనేలేదు
ఆ దినాలకన్న చాల ముందుకు నడిచింది
మన సమాజము
ఆ నడకే ఏ నృత్యముగా మారుతుందో
ముందుతరాలలో
మన దేశము సనాతన ద్వీపముగా ఉండలేదు
పరదేశాల ప్రభావము పడుతూనే యున్నది.

205

ప్రకృతిలో ఏదీ
ఏకపత్నీవ్రతమును స్వీకరించలేదు
ఇస్లాం మతము స్వీకరించలేదు
తొలుతనుండి
ఏకకాలములో ఏకమంటున్నాయి
కొన్ని మతాలు.
ఎంత భావవిప్లవము జరుగుచున్నదో
గమనిస్తుంటే ఆశ్చర్యముగా ఉంటుంది

206

సాంప్రదాయసిద్ధమైన
మజ్జాగతములైన నమ్మకాలు
కొన్ని ఉన్నాయి మానవ సమాజములో.
అంధవిశ్వాస విగ్రహాలను విరగగొట్టే
యత్నాలు ఉద్యమాలు
విప్లవకేతువును ఎగురవేశాయి
మన కండ్ల ఎదుటనే
చస్తానంటున్నాయి కొన్ని నమ్మకాలు
కాని చావవు.
అల్పాయుస్సు మొంది ఆయుస్సువారలు
మనుష్యులలో ఉన్నట్లే, నమ్మకాలుకూడా.

### 209

అమాయకముగ కాన్పించే
నల్లని అమ్మాయి ఆకాశము
అవకాశము దొరికినప్పుడల్లా
ఎన్నైనా హేలావిలాసాలను చూపుతుంది
ఎన్ని చెణుకులు, ఎన్ని వయ్యారాలు.

### 210

తుంపరల మొదలు మెరుపుల వరకు
మంచులు మొదలు అట్టహాసాలవరకు
కుంభవర్షాలు మొదలు ఇంద్రధనుస్సుల వరకు
ఎన్ని సొగసులు, ఎన్ని సరసాలు
ఆడుతు వస్తుంది నింగి నేలకు.

### 211

టి.వి.లో నృత్యసుందరి
కూచిపూడి నాట్యము చేసింది
స్థూలమైన, మృదులమైన కాళ్లకన్న
చంచల చపలమైన కళ్లే
ఎక్కువ నృత్యము చేశాయి
రవళించే కాళ్లకన్న
నీరవములైన కళ్లే
రసభావాలను రమ్యంగా చిత్రించాయి
కన్నులకున్న శక్తి అపారము కాదా !

## 212

కానుకగా వచ్చిన క్యాసెట్టును విన్నాను
శృంగార నృత్యగీతాలనబడు జావళీలు
రచయిత గాయని నేను వినని పేరులే
సాహిత్యము జావళి సాంప్రదాయములోనిదే
సంగీతము హాయిగానే ఉన్నది.

## 213

అనుకోని ఆశించని
మాధుర్యముతో నిండిన సంగీతసుధ.
కంఠస్వరము, భావమునకు తగిన ఉచ్చారణ
జంత్రవాద్యముల నేపథ్యము
ఎంతో ఆనందపరచినవి
కొన్నివేళల ఆనందముతో కన్నులు చెమ్మగిల్లినాయి
కానుక మంచిదేయని సంతసిల్లినాను.

## 214

జావళులు తెలుగు ప్రత్యేకత
తెలుగు పదాల తియ్యదనము
ఇక్కడనే నాకు ఎక్కువగా గోచరించేది
మగువల శృంగార వియోగ మనస్థితుల
విశదపరచేవే

వానిలో ఎంత వాస్తవమో
ఎంత కవిత్వమో నాకు తెలియదు
రమణీయమైన రసగుళికలు
జాలిని పుట్టించు విరహ వ్యాకులతలు

## 215

ఉర్దూ సాహిత్యములో పురుషుల ప్రేమ
ఉన్మాదమై పురి విప్పుతుంది
ఎడారులలో కూలవేస్తుంది.
చినిగిన చొక్కాలతో అర్ధనగ్నంగా
కాన్పిస్తుంది
గజల్, జావళి కొమ్మలు వేరుదిక్కులుగా సాగినా
ప్రేమవనము విచారము కలిగించేదే
సంతోషపరిచేదే
ప్రేమసూత్రాల ప్రపంచముతో ముడిపెట్టేవే
ముడిచిక్కులతో విసిగించేవే

## 216

వెండితెర, ప్రణవోత్సవాల ప్రదర్శనారంగము
ప్రేమముఖానికి గల శతకోణాలను చూపుతుంది
అందు సన్యాసులకు విరాగులకు తావులేదు
సన్యాసపాత్రలు కాన్పించినా
దొంగసన్యాసులుగనే ఉంటారు.

## 217

సత్యభామ అనగానే
పారిజాతాపహరణం, కృష్ణతులాభారము
మనస్సు కవాటాలను తట్టుతాయి
పెనిమిటిని గుప్పెట్లో పెట్టకోరే రాణిగా
ఈర్ష్యాళువైన సవతిగ కాన్పిస్తుంది
నరకాసురవధలోని వీర సత్యభామగ
గోచరింపదు, దీపావళి పండుగలలో తప్ప.

## 218

కాంగ్రెసు చిహ్నముగ
1937 ఎన్నికలతో పచ్చరంగుతో ప్రారంభమైనది
రంగులు పోయి బొమ్మలు వచ్చినపుడు
కాడితో జతకూడిన రెండు ఎద్దులుగా మారింది
తర్వాత ఆవు దూడగా మారింది
ప్రస్తుతము హస్తముగా చలామణి యగుచున్నది

## 219

అన్ని అంగములకన్న మిన్నగా
మనము చేతులనే వాడుతాము
ఆశీర్వచనము మొదలు సంహారము వరకు
తినుట మొదలు వ్రాత వరకు
ఇచ్చుటకు మొదలు పుచ్చుకొనుటవరకు
అలంకారము మొదలు శృంగారము వరకు
మాటలకు బలిమిగా చేతుల కదలిస్తుంటాము
దేహమునకు పనిముట్లు చేతులు

## 220

ఆమె పేరు ప్రతిష్ఠలను
అందచందాలను
తన ప్రశంసా ముకురములో చూపిస్తాడు
నిద్రాణముగ నున్న ఆమె భావాలను స్మృతులను
మేల్కొలిపి, నృత్యము చేయింప యత్నిస్తాడు
ఆమె నిర్వికారముగా, మౌన ఉపేక్షలతోనే
అర్థము కానట్లే నటించి వెడలిపోతుంది.

**221**

భారతీయ నృత్యసాంప్రదాయాలన్నిటికీ
కథక్, మణిపూరి, కూచిపూడి, ఒడిస్సీలకు
మూలస్తంభము కేంద్రబిందువు
గానలోలుడగు శ్రీకృష్ణుడే
భరతనాట్యంలో నటరాజు విగ్రహాన్ని
పెట్టుతారు
ఇతర సాంప్రదాయాలలో
నటవర, మురళీధర కృష్ణ విగ్రహమే
గీతలో వేదాంతము బోధించిన కృష్ణుడే
నృత్యవినోదాలను ప్రోత్సహించినవాడు
వేణునాదములో సంగీత స్వారస్యమును
వినిపించినవాడు
శ్రీరాముడు కోదండరాముడైతే
నృత్యసంగీతాలకు దూరమైనవాడే
అందుకనే పూర్ణావతారమన్నారు
శ్రీకృష్ణుని.

**222**

త్యాగరాజు రామభక్తుడైనా
నౌకావిజయములో శ్రీకృష్ణుని
విస్మరింపలేదు.
రామభక్తుడగు పోతన్న కూడా
దశమస్కంధములో కృష్ణుని
ఎంతో రమ్యంగా వర్ణించినాడు.

## 223

వల్లభాచారి తెలుగు ఆచార్యుడు
పశ్చిమభారతాన కృష్ణతత్వాన్ని
ఎక్కువ ప్రచారములోనికి తెచ్చాడు,
శతాబాలు గడచినా వారి శిష్యులు
వచ్చీరాని తెనుగును మాట్లాడేవారు
అచ్చటచ్చట నాకు ఎదురైనారు

## 224

మానవ శరీరం ఒక లత
లతకు చిప్పళ్లమాటున
పూసింది హృదయ పుష్పం
పుష్పం వికసింప
పరిమళాలు వ్యాపించాయి,
ఒకచోట స్నేహము, మరొకచోట ప్రేమ
వేరొకచోట శృంగారము.

## 225

ఆకాశము
నీ బ్రతుకు అలల కదలిని
ఆటుపోటుల ఉయ్యాలలో ఊపింది.
నీ పతన ఘోషాణ సమాధిని
చల్లని తెమ్మెరల వింజామరలతో వీచింది.

## 226

ప్రభాత ప్రభలు, మలయ మారుతాలు
జీవననౌకను నడిపాయి
నిశీథ తిమిరాలను, హేమంత శిశిరాలను
ఎదుర్కొంటూ నడిచింది పడవ.

## 227

ఎన్నింటికని పశ్చాత్తాపపడగలము
ఎందరిని భావాలచేత, మాటలచేత
చేష్టలచేత నొప్పించామో
ఎందరిని అవహేళనగ చులకన చేశామో
ఎందరిని ద్వేషభావముతో చూచామో
తప్పిదముల జబ్బుకు
విచారించుటే మందు

## 228

మనిషి తప్పిదాల మూట
మూట విప్పితే అంతా దొనగులే.
వానిని చూచి, అతనే సిగ్గిలుచుంటాడు
అట్లని మారి మానితే మంచిదే
కాని మారలేడు, మానలేడు
అందుకే అతను మానవుడు.
పుడమి బురదలో ఈదుచు నుంటాడు.

## 229

విద్వాంసుల చూచి
దగ్గరగా చేరాలని బుద్ధిపుట్టుతుంది
వైద్యుల చూచి
దూరముగా తొలగాలని అనిపిస్తుంది
విద్వాంసులవద్దకు ఆనందముతో పోతాము
వైద్యులవద్దకు రోగాలతో, నొప్పిలతో పోతాము
కాన్పుకు పొయ్యేవారు
నొప్పులతో పోయినా, రోగముతో కాదులే

## 230

ఉద్యోగమునకు వచ్చినవారిని
మీరు ఉత్తరాదివారా, దక్షిణాదివారా
అని అడిగేవాడు బెజవాడ పాపిరెడ్డి
సిఫారసు ఉత్తరముతో వచ్చినవారా
దక్షిణ యిచ్చుటకు వచ్చినవారా అనే అర్థములో.

## 231

నా పుస్తకాల అంకితము
ఎవరూ ఆశించరాదు
చనిపోయినవారికే నేను అంకితమిచ్చేది
స్నేహముచేతనో ఆదరముతోనో
స్మృత్యర్థముగా అంకితమిస్తాను
ప్రతిఫలము కోరుటకు వీలులేని
ఆత్మీయులకే అంకితమిస్తాను

## 232

ఒకరు ఎం. ఎల్. ఎ. కావాలని కోరడం
యం. ఎల్. ఎ. మంత్రి కావాలని కోరడం
మంత్రి ముఖ్యమంత్రి కావాలని కోరడం
తప్పిదమా, పాపమా ?
రాజకీయాల్లోకి రావడం
ఆరోగ్యాన్ని చక్కబెట్టుకోడానికా
మోక్షము పొందడానికా
రాజకీయాలు ఆరోగ్య మందిరాలు
ముముక్షువుల ఆశ్రమాలు కావే
సేవా పతాకాన్ని చేబూని
అధికారాన్ని చేపట్టాలనే గదా
కాదంటే మోసమే అగుతుంది
ఆత్మవంచనే అగుతుంది.

## 233

ఆకాశము
నీ జీవన తరంగాలను
వెన్నెలచే ఎగిరించింది
నీ నీరవ సమాధిని
మంచుచే చల్లపరచింది

234

కొందరు సంకల్పాలను
మాటలరూపమున చెప్పేస్తారు
మాటలరూపములో నిర్ణయాలు జరుగుతాయి
వాగ్దానాలగుతాయి
చాల సెరవేరనివే వాగ్దానాలు
సంకల్పాలు అసత్యాలగుతాయి
వాగ్దాన భంగమగుతాయి
సంకల్పాలను హృదయ మంజూషములోనే
దాస్తే మంచిది.

235

మధ్యాహ్నము నల్లమబ్బులు మునిరాయి
చీకట్లు క్రమ్మాయి
మబ్బుల పిపులమీద
ఎంత ఎండ కాస్తున్నదో
ఎటూ ఊహించలేము.

236

వెలుతురు విలువ ఎంత వెలుగులో
దాని ప్రతాపము చీకట్ల పరగణాలలోనే
కవిప్రతిభ ఎంత సమకాలీన సమాజములో
రవిప్రభ ఎంత అస్త్రాద్రి వెనుక.

237

జీవనకాంతిలో కవి దీపమును వెలుగనియ్యదు
జీవితాంత తిమిరాలలో ప్రకాశిస్తుంది
ఉదయమున ముకుళాయమైన కవిత
మరణాంతర మునిమాపులో పుష్పించి
పరిమళిస్తుంది.

238

సమకాల సమాజములో గోడ అడ్డులున్నాయి
చావు గుసపములతో అవి కూలిపోతాయి
తెరచిన తలుపులగుండ
కవితా సౌరభము దశదిశల వ్యాపిస్తుంది

239

పగవారు లేరు, పరాయివారు లేరు
చావుచీకట్ల తెరవెనుక
చావుబుట్టలో చేరి నిదురింప
పడగనెత్తలేవు బ్రతుకు పాములు

240

బ్రతుకు పగటిపూటే పగలు పగలు
చావురేయిలో అన్నీ సమసిపోతాయి
జబ్బులు నొప్పులు అన్నీ చల్లబడతాయి
అంతా శాంతే, అభయమైన శాంతే.

## 244

80 సంవత్సరాలు నిండిన వయస్సులో
40 సంత్సరాలు స్వరాజ్య స్వప్నాల కన్నాను
40 సంవత్సరాలు స్వరాజ్య సిద్ధిని చూచాను
ఇంకొక 40 ఏళ్లకు ఏ తెలియరాని
రాజ్యమునుండో స్వరాజ్యస్థితిని చూస్తానో
హర్షించేస్థితి రాజ్యాన్నే చూస్తానని విశ్వాసము

## 245

చిక్కులు, చీకాకులు ఎప్పుడూ ఉంటాయి
అడ్డుగోడలు, కంచెలు ఉంటాయి
అట్లని చతికిలపడతామా ?
తెప్పరిల్లుకొని, ధైర్యముతో, విశ్వాసముతో
ముందుకు పయనిస్తాము.

## 246

ప్రయాణము సాగుచున్నది
తుఫానులు రానీ, వేడి ఎండలు కాగనీ
వరదలు పొర్లనీ, కరువులు మాడ్చనీ
తిరిగి మరలేది లేదు.
మన కాళ్లు వెనుకకు నడవవు
ముందుకు చూచే చూపులే,
ముందుకు నడిచే నడకలే
అదే ప్రకృతి లక్షణము
భవిష్యత్తు ఆహ్వానము, ప్రయాణము
సాగించాలె, సాగుచున్నది.

## 247

నీ పావన కార్యపతాకము
మా కొసగితివి.
మోయుటకు ముందుకు నడిపించుటకు
బలమునిమ్ము, విశ్వాసముతో నింపుము
అలసత్వముతో కదలకున్న
నీ చురుకు కొరడాతో మా వీపుల కొట్టుము
జెండా యిచ్చిన నీవు, మోసే శక్తి నిమ్ము.

## 248

1౯౪౭లో మేము యియ్యగలిగినదేమి ?
87 పాత్రతో పోసే నీలాలతో
విత్తనాలు మొలకెత్తాలె.
పెరగాలె, పంట పండాలె.
కోయాలె, నూరవాలె, దంచాలె
వండి, అందరికీ అన్నము పెట్టాలె.

## 249

వండుటకు మండు, నిప్పు రాజేయాలి
మంటగా ఊదాలి, చెమటలు కార్చాలి
వండిన అన్నము తిని, ప్రయాణానికి సిద్ధమయ్యేది

## 250

ప్రయాణానికి ఎగుడు దిగుడు ఉన్నాయి
గుట్ట ఎక్కవలసిన గుడిసె లున్నాయి
ముళ్లకంచెలున్నాయి, గులకలు, బండరాళ్లు
ఇసుకతిన్నెలు, బురదమళ్లు ఉన్నాయి
కానీ తిరిగిపోకూడదు
ముందుకు నడవాలి, నడుస్తున్నాము
గమ్యాన్ని చేర్తాము
అదే ముందుకాలాల ఆదేశము.

## 251

శ్రమలేని ప్రయాణము లేదు
స్వేదములేని గమనము లేదు
ఆయాసములేని ప్రయాస లేదు
ఆడే గుండె లేని ప్రాణము లేదు
ప్రాణాన్ని ఒడ్డి, ముందుకు పోవాలె.

## 252

వీరులదే రాజ్యం, పిరికిపందలది కాదు
రెక్కలు విప్పితేనే ఆకాశము
లేకుంటే దుమ్మే.

## 253

ఆకాశపు విమానము
ఎగురుతునే ఉండాలి
కదలిక మానేస్తే
కూలుతుంది, కాలిపోతుంది

## 254

ఏదీ స్తబ్ధముగా లేదు
గాలి వీస్తూనే ఉన్నది
నీళ్లు పారుచునే ఉన్నవి
భూమి తిరుగుచునే ఉన్నది
సంఘము, భాష కదలకుండా ఉండాలా
మార్పు వద్దా, కూర్పు వద్దా!

## 255

తాతల గుడిసెలు చాలునా
దున్నపోతుల బండ్లు చాలునా
నారచీరెలు చాలునా
జింకచర్మాల కౌపీనాలు చాలునా
చాల ముందుకు వచ్చాము
ముందు ఎంతో ఉన్నది, పోదాము.